# కృష్ణాజిల్లా తెలుగు రచయితల ఐదవ మహాసభలు

గాంధీక్షేత్రం
అవనిగడ్డ

**1982**
**జూలై 10, 11 తేదీలు**




నిర్వహణ
దివిసీమ సాహితీ సమితి

1

# కృష్ణాజిల్లా తెలుగు రచయితల 5వ మహాసభలు

1982
జూలై
10, 11 తేదీలు

గాంధీ క్షేత్రం
అవనిగడ్డ

**SOUVENIR**

నిర్వాహణ
దివిసీమ సాహితీ సమితి
అవనిగడ్డ

# కార్యక్రమ పత్రిక

10-7-82 శనివారం ఉదయం 10 గం.

ప్రారంభ సమావేశము

అధ్యక్షులు

శ్రీ సంజీవ దేవ్

స్వాగతం

శ్రీ మండలి వెంకట కృష్ణారావు

మహాసభల ప్రారంభకులు

డా॥ దాశరథి

సావెనీర్ ఆవిష్కరణ

శ్రీ ముక్కామల నాగభూషణం

ఉదయం 11 గం.

సంప్రదాయ సాహిత్య సదస్సు

అధ్యక్షులు

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ముఖ్య అతిథి

శ్రీ కోట సుందరరామశర్మ

ప్రసంగములు

శ్రీమతి సి. వేదవతి

డా॥ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి

శ్రీ జోశ్యుల సూర్యనారాయణమూర్తి

కుమారి యస్. శ్రీలక్ష్మీదేవి

సాయంత్రం 4 గం.

బాల సాహిత్య సదస్సు

అధ్యక్షులు

శ్రీ బి. వి. నరసింహారావు

ముఖ్య అతిథి

శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్

ప్రసంగములు

శ్రీ సోమంచి రామం

శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం

శ్రీమతి డి. సుజాతాదేవి

డా॥ వెలగా వెంకటప్పయ్య

సాయంత్రం 6 గం.

మినీ కథా సమ్మేళనం

అధ్యక్షులు

డా॥ తెన్నేటి లత

మినీకథా పఠనం

డా॥ పోతుకూచి వెంకటేశ్వర్లు

శ్రీమతి కె. వసుంధరాదేవి

శ్రీమతి వక్కలంక పద్మావతి

శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల

శ్రీ మల్లాది సూరిశాస్త్రి

శ్రీ బొమ్మిన వెంకటేశ్వరరావు

11-7-82 ఆదివారం ఉదయం 9-00 గం.

కవితా సదస్సు

అధ్యక్షులు

డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు

ముఖ్య అతిథి

డా॥ మిరియాల రామకృష్ణ

ప్రసంగములు
శ్రీ టి. యల్. కాంతారావు
శ్రీ అద్దేపల్లి రామమోహనరావు
కుమారి వింజమూరి లక్ష్మి
శ్రీ రావి రంగారావు
శ్రీమతి కె. విశ్వల

ఉదయం 11-00 గం.
యువక సదస్సు

అధ్యక్షులు
శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య

ముఖ్య అతిథి
శ్రీ పోతుకూచి సాంబశివరావు

ప్రసంగములు
శ్రీ పురాణపండ రంగనాథ్
శ్రీ మైత్రేయ
శ్రీ స్వర్ణరాజ హనుమంతరావు
డా॥ యస్. గంగప్ప

సాయంత్రం 4 గం.
కథ, నవలా సదస్సు

అధ్యక్షులు
శ్రీ మహీధర రామమోహనరావు

ముఖ్య అతిథి
కుమారి వాసిరెడ్డి సీతాదేవి

ప్రసంగములు
శ్రీ విహారి
శ్రీ వీరాజీ
శ్రీ కె. రామమోహనరాయ్
శ్రీ నవీన్
శ్రీ కవనశర్మ

సాయంత్రం 6-00 గం.

కవి సమ్మేళనం

అధ్యక్షులు
శ్రీ ఆరుద్ర

వీడ్కోలు సందేశం
శ్రీ ఐ. రామకృష్ణంరాజు
(సాంస్కృతిక శాఖామాత్యులు)

పాల్గొనువారు
శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామి
శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి
శ్రీ దాసి బసవయ్య
శ్రీ పువ్వాడ తిక్కనసోమయాజి
కుమారి వి. సత్యసావిత్రి
శ్రీ యస్. హెచ్. యస్. ప్రసాదరావు
శ్రీ తెన్నేల ఎలీషా
కుమారి యం. హైమవతి
శ్రీ కోట పాల్ దేవరాజు
కుమారి కె. పుష్పలత
శ్రీ నోరి రాజేశ్వరరావు
శ్రీ రెంటాల సత్యనారాయణ
శ్రీ పి. శ్యామలానందప్రసాద్
శ్రీ యం. పి. జానుకవి
శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్



4

# కృష్ణాజిల్లా తెలుగు రచయితల
# 5 వ మహాసభలు



ఆహ్వాన సంఘాధ్యక్షులు

**శ్రీ మండలి వెంకట కృష్ణారావు**

సారధ్య సంఘం గౌరవాధ్యక్షులు

**శ్రీ ముక్కామల నాగభూషణం**

దివిసీమ సాహితీ సమితి అధ్యక్షులు

**శ్రీ కావూరి వెంకటరామయ్య**

సారధ్య సంఘం

అధ్యక్షుడు : గుత్తికొండ సుబ్బారావు

ఉపాధ్యక్షులు : అక్కల సరస్వతీ బాబురావ్
డి. సుజాతాదేవి
కె. వసుంధరాదేవి

ప్రధాన కార్యదర్శి : మండలి బుద్ధప్రసాద్

కార్యదర్శులు : బూదరాజు శ్యామసుందర్
యమ్. వి. మూర్తి
సనకా సుబ్బారావు

కోశాధికారి : జోశ్యుల సూర్యనారాయణమూర్తి

కన్వీనర్ : జి. వి. పూర్ణచందు

భవనం వెంకటరామ్
ముఖ్యమంత్రి

హైదరాబాదు
ది 6-7-1982

ప్రియమైన కృష్ణారావు గారికి,

సేవాక్షేత్రంగా పేరు పొందిన గాంధీక్షేత్రంలో ఈ నెల 10, 11 తేదీలలో కృష్ణాజిల్లా తెలుగు రచయితల ఐదవ మహాసభలు దివిసీమ సాహితీ సమితి ఆధ్వర్యంలో జరగడం ఎంతో ముదావహం. యువరచయితలను సమీకరించి జాతికి స్పందన కలిగించే ఉత్తమ సాహిత్యాన్ని వారు ఇతోధికంగా అందించేందుకు తగిన ప్రోత్సాహం సభల వల్ల తప్పక లభించగలదని ఆశిస్తున్నాను. సమాజ సేవా క్షేత్రంగా ప్రఖ్యాతినొందిన గాంధీక్షేత్రం సాహిత్య క్షేత్రంగా కూడా అన్ని విధాలా విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

తెలుగు రచయితల మహాసభలు జయప్రదంగా నిర్వహించడానికి కృషి చేస్తున్న మీకు, మీ సహచరులకు, సాహితీ మిత్రులకు నా హృదయపూర్వక అభినందనలు.

శుభాకాంక్షలతో,

మీ

భవనం వెంకటరామ్

# కాలచక్రం

కోట సుందరరామ శర్మ

ఒక్క అంగను జెట్ విమానం
ఝంగుమని న్యూయార్కు నుండీ
లండనుకు ఎగిరింది కానీ,
చేతి గడియారాలు మాత్రం
గంట కర్తవై నిముసములకో
నిముసమున కర్తవై సెకన్లుగ
తాముమటుకు యథాప్రకారం
తిరుగుతూనే ఉన్నవే మరి!
ఎక్కడండీ కాల చక్రం
తొరగ తొరగా తిరగడంట?

పాతకాలపు విరహ నాయిక
ఒక్క నిముసం ఒక్క యుగమై
గడుస్తోందని మొత్తుకొన్నా,
చంద్రు నుదయం అస్తమయమూ
కొలిచినట్లే జరిగినాయే!
ఏది, పంచాంగాలు మారీ
జాతకాల్ తలక్రిందు కాలే;
దెక్కడండీ కాల చక్రం
మందగతిగా తిరగడంట!

“రాత్రి రేవ(ం) వ్యరంసీ” త్తని
(చిటుక కూడా వేసి యేమో)
రాముడంతటి వాడే, కాదు+ఆ
మహాకవి భవభూతి అన్నా,
(రిస్టువాచొకటుండియున్నా
ఎవ్వరండి చూసుకొందురు!)
తొందరగ తెలవారినట్లా!

కాలచక్రం నిదానంగా ప్రయాణిస్తే,
కుర్రగాళ్ళకు నాల్కపై ఐస్క్రీం
కొంచెం
సేపు ఎక్కువ నిల్చునేమో!
కల్లుముంతకు రెండు గ్లాసులు
కొంత కెక్కువ వచ్చునేమో!
ప్రేమలేఖల పుటల కింక
ఫార మెక్కువ పలయునేమో!

గబగబా పారబాటువల్లే
చీల తిరిగిన మీద, బాబోయ్!
వెండి తెరపై నడక పరుగై.
అందమైనా కేమెరాలో
మూడి మంగలమైన మొగమై,
గ్రామఫోను ధ్వని పిచ్చిగోలై,
ఫస్టుమార్కులు వచ్చువానికి
ప్యాసు మార్కులు కూడ కరవై,
కాల చక్రం తొందరిస్తే,
ద్రుత విలంబిత గతులు మారా!
ఎందుకో ఆనందభైరవి
నీ ప్రకారం నాదనామ
క్రియగ మార్చడ మెవరి కిష్టం?

పాప, మెందుకు ప్రపంచానికి
ప్రళయ విలయాల్ కలుగ వలెనని,
ఎవరు దయతలచింది! ఎందుకు?

* *

# కవి పండిత మండిత కృష్ణామండలి

జోశ్యుల సూర్యనారాయణమూర్తి

"అసారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః" అన్నారు. అంతులేని కావ్యప్రపంచంలో కవియే ప్రజాపతి. ఈ అనంత కావ్యజగత్తుకి కవిమాత్రమే సృష్టికర్త. లోకం కావ్యంలో ప్రతిబింబిస్తుంది. లోకజ్ఞుడై క్రాంత దర్శిత్వంతో తపస్సిద్ధి సాధించిన ఋషి తుల్యుడు కవి. "నానృషిఃకురుతే కావ్యం" అన్నది మన పెద్దలైన పండితుల సిద్ధాంతం. రసజ్ఞులైన పండితులకు కావ్య జగ ద్రహస్య పరిజ్ఞానం సహృదయతా సార్థ క్యాన్ని ప్రసాదిస్తుంది. కవిపండితుల కవన, పాండితీవైభవం పాఠక సామాజిక లోక హృదయాహ్లాదకరమైన భావసౌరభం. సుఖ దుఃఖమయమైన జనజీవనవనంలో సంసారం విషవృక్షం. ఆ విష వృక్షానికి కాచిన కాయల్లో రెండే రెండు తియ్యని పండ్లయ్యా యంటారు.

"సంసార విషవృక్షస్య ద్వేఫలే
అమృతోపమే
కావ్యామృత రసాస్వాదః సంగతి
స్సజ్జనైస్సహ"

ఒకటి కావ్యామృత రసాస్వాదం — రెండ వది సజ్జనసాంగత్యం. ఈ రెండు లభించిన నాడు జీవనం దుఃఖమయమైనా సుఖాను భూతినంది నందనవనమౌతుంది.

కవి తన రచనలనే అద్దంలో లోకాన్ని చూపిస్తే పండితుడని గ్రహించి లోకానికి విశదపరుస్తూ ఉంటాడు. ఇది అనాదిగా మన సాహితీ జగత్తులో కనిపించే సంప్రదాయ సంపత్తు. కవి పండితుల పరస్పర మధురభావ భావితాంతః కరణత్వం లోక కళ్యాణ ప్రద మౌతుంది. విశ్వ శ్రేయమే సర్వసాహితీ జగత్సృష్టికి పరమ ప్రయోజనం.

ఇటువంటి కవి పండితమండలి యే మండ లంలో మండితమౌతుందో ఆ మండలం దుఃఖనిరాసం ద్వారా ఆనందమయ వినోదం పొందగలుగుతుంది.

భారత భూమి పుణ్యవిశేషంచేత ఆది కవి వాల్మీకి నోట వెలువడిన శోకం శ్లోకత్వాన్ని ఏ పుణ్యవేళలో పొందిందో ఆ నాటినుంచీ ఖండఖండాంతర విఖ్యాతి భారతీయ సాహి త్యానికీ, తత్స్రష్టలకీ అవిచ్ఛిన్నంగా కొన సాగుతూనే ఉంది.

భారతీయ భాషలలో మాధుర్యాన్ని నిలువెల్ల వెల్లివిరియించుకొని కృష్ణా గోదా వరీ, పినాకినీ పుణ్యవాహినీతీర కేదారాలలో రాజనాలు పండించిన తెలుగుతల్లి తన యెల్ల మండలాలలోనూ నిండుతనాన్నే సంతరించు కొంది. కృష్ణామండలం కూడ తాతలనాటి నుంచీ కవిపండిత మండలికీ గాయక నాయక మణులకీ నెలవై విలసిల్లిన తన పుణ్యచరిత్ర వినిపిస్తూనే ఉంది.

తొలినాళులలోనైనా, నవ నాగరికత తెలి వొందిన యీ నాళులలోనైనా, ఆత్మానుభూతిని తమచుట్టూ మెలిగే తమ సమాజానికి చూపిస్తూ, పలురీతుల పలవించే కవికోకిలలీ కృష్ణామండలమంతా నవవసంతం పండిస్తూనే ఉన్నాయి. మధురాలాపనిసర్గ పాండితి నిండిస్తూనే ఉన్నాయి.

కృష్ణామండలం ఒకనాడు భీమవరం (ఇప్పుడు పశ్చిమ గోదావరి) తాలూకాను కూడా తనలోనే నింపుకొంది. సువిశాలమైన యీ మండలంలో చల్లపల్లి, నూజివీడు, ముక్త్యాల మొదలయిన సంస్థానాలు వలు మూలలా సాహితీప్రీతిని వెలార్చిన పరస్వతీ సమర్చనా విధానాలు. తమ ఆస్థానాలలో సాహిత్య పరిషత్తులు సాగించి సమకాలీన కవిచంద్రులనెందరినో సత్కరించి ఒక్కొక్క నూలుపోగునందించిన కీర్తి ఈ కృష్ణామండల సంస్థానాధీశులు గడించిన తఱిగని ఆస్తి. శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి గారి భారతం వెలువరించటం, విశ్వనాథవారి కల్ప వృక్షం తెలుగునాట నాటటంవంటి సాహితీ సమర్చన ముక్త్యాల సంస్థానాధీశుల యీ శతాబ్దపు విశిష్టత. సంస్థానాల సాహితీ సంభార సత్కారాలు దేశకాలావధు లధిగ మించి రసజ్ఞతా ప్రసక్తాలయ్యాయి.

రాజాశ్రయం లేకుండానే కవిరాజుల్నీ పండిత ప్రకాండుల్నీ తన ఒడి నిండా నింపుకొని పోషించిన కృష్ణామండలి యొక్క గత వైభవాన్ని (తెలిసినంతవరకు) ప్రస్తుతవిస్తృతినీ సాధ్యమైనంతగా సంస్మరించుకొని రచయిత్రీమండలి చేసుకొనే పండుగలో భావి గమనాన్ని గమనిద్దాం.

ఆంధ్రకవుల చరిత్ర శ్రీ వీరేశలింగం పంతులుగారు చెప్పేదాకా మనకు తెలియదనటం సత్యదూరంకాదు. మనకు చరిత్ర నిర్మాణమే కాని తద్రచనా ప్రయత్నం మొదటినుంచీ అంతగా లేదు. "మందకవియశః ప్రార్థీగమిష్యామ్యుపహాస్యతాం" అనే కవి కులతిలకుని వినమ్రత్వమే మన కవిలోక ప్రహ్వీభావానికి మార్గదర్శకమవటం చేత నేమో మన యేపూర్వకవీ తన సమాచారం విస్తృతంగా వెల్లడించిన పుణ్యం కట్టుకో లేదు. గత కవితావైభవమే కాని గత కవి చరిత్ర సందేహరహితంగా మనకు సంప్రాప్తం కాలేదు.

ఆంధ్రకవుల సంగతే యీ విధంగా వుండగా సంస్కృత కవిచంద్రుల వెన్నెలలు కాసిన శారదరాత్రుల కథలకు తరువాత చీకట్లుక్రమ్మి మసకమసకగా కనిపించడంలో ఆశ్చర్యమేముంది?

లీలాశుకుని కృష్ణకర్ణామృతం కృష్ణామండలంలో వెలిసింది. అది సంస్కృతభాషలో వెలువడిన యిక్కడి మొదటి మధురకృతి. యావద్భారతాదృతిని పొందిన సుకృతి లీలాశుకమౌని ఈ మండలనివాసి. శ్రీ శివనారాయణ తీర్థులవారీ ప్రాంతం వారే. వాదోపవాదాలకు తావిచ్చిన సదాశివబ్రహ్మేంద్ర యోగి, సుబ్రహ్మణ్య కవి, కోలవిగోపరాజు, కంకంటిపాపరాజు ఈ మండలంవారంటారు. చరిత్రకంతగా అందని యీనాటి కవీంద్రులీ విధంగా కృష్ణామండలంలో జన్మించటమో జీవించటమో జరిగిందట. కొల్పట్టణము నేటి కలపటమే అనేవాదంకూడ ఉండికదా! యావదాంధ్రానికే చెందిన శ్రీనాథుడు తూర్పు గోదావరిలోనో ఈ జిల్లాలోనో పుట్టి వుంటాడనుకోవటం మనకొక తృప్తి. ఆయన తాను కొండవీటివాడనన్నాడు. "నా కవిత్వంబు నిజము కర్ణాటభాష" అంటూ మనని తికమక పెట్టాడనుకోండి. యదార్థానికి కవులందరూ

అందరివాళ్ళూను. పోతన్నగారే ప్రాంతానికైనా పరాయి వాడిలా కనిపిస్తున్నాడా చెప్పండి. అయినా ప్రాంతీయతా ప్రీతి పర ప్రాంత ద్వేషం లేనంతవరకు ఒక విధంగా సంతృప్తిదాయకం కదా!

మొవ్వ కూచిపూడి గ్రామాలలో జన్మించిన మహానుభావులైన వాగ్గేయకార కవివర్యులు కృష్ణామండలానికి ఖ్యాతి తెచ్చారు. అన్ని క్షేత్రాలు చూచి "క్షేత్రయ్య" అనిపించుకొన్న వరదయ్యగారు మొవ్వ గ్రామవాసి. క్షేత్రయ్య పదకవిత ఆంధ్ర కవితకే ఒక క్రొత్త పలుకుబడి నిచ్చింది. "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న దానికీ "రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యం" అన్న లక్షణానికీ కూడ లక్ష్య భూతంగా క్షేత్రయ్య పదాలీనాటికీ యావదాంధ్రవ్యాప్తి పొందటం తత్కర్తృ జన్మస్థానంగా కృష్ణా మండలానికి గర్వకారణం.

దివిసీమవాడైన సిద్ధేంద్రయోగి కూచిపూడివారికి నాటికీ ఆరాధ్యదైవం. కూచిపూడి. నాట్యానికి తన పేరుతో జగత్తులో ప్రఖ్యాతి సంపాదించిన గ్రామం. కూచిపూడి వారి యక్షగాన ప్రయోగాలవల్ల, పద కవిత నుంచి వెలువడ్డ యక్షగానాలకానాడున్న ప్రజాదరణవల్ల ఆ రచనలు పెరిగాయి.

19వ శతాబ్దంలో మొవ్వ నివాసులైన కేశవభొట్ల రాజగోపాలంగారు కేశవభొట్ల వెంకటప్పయ్యగారు పదకవితారచనచేశారు. శతకకర్తలుకూడ. ఈ కాలంలో ఈ మండలంలో శ్రీయుతులు పింగళి రామయ్య, అల్లూరి రాజేశ్వర కవి, ఎలకుర్తి రామరాజు కాసుల పురుషోత్తమకవి ప్రభృతులున్నారు.

కాసుల పురుషోత్తమ కవి పెదప్రోలునివాసి. ఆంధ్రనాయక శతకం సాహిత్యంలోనే తన ప్రత్యేకత ప్రదర్శిస్తుంది,

అవధాన ప్రక్రియా పితామహులలో ఉద్దండమూర్తి అనిపించుకొన్న సహస్రావధాని మాడభూషి వెంకటాచార్యుల వారు ఈ శతానికి చెందిన మహాపండితులట. నూజివీడు సంస్థానంలో ఉండేవారని శ్రీ వేంకట శాస్త్రిగారికి గురుతుల్యులనీ చెపుతారు. "శతదూషణి" మీద ఖండన చెప్పినమేధావి, "భారతాభ్యుదయ" కర్త.

కాలపరిణామంతో పాటు పర రాష్ట్రీయ నాటక రచనా ప్రదర్శన పద్ధతుల ప్రభావంతో కూచిపూడి నాటకాల ప్రాచుర్యం తగ్గి గద్య పద్యాత్మక నూతన నాటకాల ప్రయోగాలు మిగిలిన ఆంధ్రదేశంతో పాటు కృష్ణామండలంలోనూ వ్యాపించాయి. నాటక సంఘాలు వెలిశాయి.

పందొమ్మిది దాటి ఇరవయ్యో శతాబ్దంలో పడిన జనజీవనంలో బందరు, విజయవాడ పట్టణాలు కవితామ తల్లికి పాండితీ ప్రౌఢిమకీ పరస్పరం పుట్టినిల్లుగాను మెట్టినిల్లుగాను కళకళలాడాయి. ఈ రోజులలో బందరు తిరుపతి వెంకటకవులలో శ్రీ చెళ్ళపిళ్ళ వారికి నివాసం కావడం వారికనేకులు శిష్యులవటం కారణంగా కవితోత్సవాలు పెరిగి కవిత్వం సామాన్య జనంలో చొచ్చుకొని, 'అదిగో ద్వారక ఆలమందలవిగో" అంటూ ఆలాపించటం మొదలుపెట్టింది. ఇది తిరుపతి వేంకటేశ్వర శకమనిపించుకొంది. గోదావరి ఇవతల, అవతల పుట్టిన తిరుపతి వెంకటకవులు యావదాంధ్రాన్నీ కవితా వర్షంతో ముంచెత్తినా వారి ప్రభావం కృష్ణామండలం మీద

పడిసతీరు, వారు సృష్టించిన శిష్యసందోహం, వెలయించిన సారస్వతం తమ ఆత్మీయతనే ఇక్కడ సంస్థాపించాయి.

కవులనీ పండితులనీ ప్రతిభా పాండిత్యాలనుబట్టి ఈ ఉభయుల్నీ మనం విడివిడిగా చెప్పుకున్నా ఆనాటి కవులని పండితులనుంచీ పండితుల్ని కవులనుంచీ విడదీసి చెప్పటం సాధ్యపడే విషయంకాదు.

మహామహోపాధ్యాయ శిష్టా నరసింహ శాస్త్రిగారు షడ్దర్శన వేత్త, కవి, మహా పండితుడు. మేఘసందేశ. వివస్వత్ప్రభాదులు వారికృతులు, సంస్కృతాంధ్రాలలో గ్రంథ రచనచేసిన బందరుపుర ప్రముఖుడైన శ్రీశాస్త్రి గారు జమీందారుల ఆదరణ కూడ పొందిన మనిషి. కోరాడ రామచంద్రశాస్త్రి, నాదెళ్ళ పురుషోత్తంగారలానాటి బందరుపురవాసులు. వేమూరి సీతారామశాస్త్రిగారవనిగడ్డవారు. వీరు కవి, పండితులు. స్వామియై మోక్ష గామియైన మహానుభావులు గుడివాడ పుర వాసి, వేదాద్రి లక్ష్మి నృసింహ భక్తులు, భమిడిపాటి అప్పయ్యశాస్త్రి గారు. "తెలుగు నాడు" శతకకర్త దేవీభాగవత కవి అయిన శ్రీ దాసు శ్రీరాములుగారు ఇతర కళలలో కూడ ప్రవేశమున్న పండితుడు. కృష్ణా మండలనివాసి. మల్లాది అచ్యుతరామశాస్త్రి గారు ద్రౌపదీవస్త్రాపహరణ నాటక రచయిత. స్కాందపురాణభాగాలు కొన్ని తెనిగించినప్పటికీ అముద్రితాలుగానే మిగిల్చారట. వీరు దివిసీమవారు. విజయవాడలో జీవించిన లక్కావఝ్ఝల కృష్ణశాస్త్రిగారు 'ఆశ్చర్య రామాయణం'- తెలుగుకావ్యాలూ కూడ వ్రాసిన పండితులు- పాండితీ ప్రాభవం తగ్గుతూ ప్రతిభా ప్రాభవం పెరుగుతూ వచ్చిన యీ కాలంలో తిరుపతి వెంకట కవుల శిష్య బృందం కవితావనచారిత్వం సాగించి వివిధ గద్య పద్య సింహనాదాలు చేసింది.

విశ్వనాథ, వేలూరి, వేటూరి, కాటూరి పింగళి ప్రభృతులు కృష్ణామండలం వారయి యావదాంధ్ర ఖ్యాతి తమకృతుల ద్వారా తమతోపాటు తమ మండలానికి సంతరించుకొన్న దిగ్దంతులు. వివిధ సాహితీరంగాలలో బహుముఖ ప్రజ్ఞ చూపిన యీ పండిత కవి వల్లభులు వెలయించిన ఆంధ్ర ప్రశస్తి సారస్వతాకాశంలో నిత్యప్రకాశం కలిగించింది.

ఈ కాలంలో కృష్ణామండల రచయితల కలాలలోనుంచి ఎన్నో నవలలు నాటకాలు విమర్శలు గేయాలు పరిశోధనలు వెలువడ్డాయి, సంఘ సంస్కర్తలు స్వాతంత్ర్యోద్యమ వీరులుకూడ గ్రంథరచనాప్రావీణ్యం చూపించిన రోజులవి. శ్రీయుతులు మానికొండ సత్యనారాయణశాస్త్రి గురజాడ రాఘవశర్మ ప్రభృతులు, కొడాలి ఆంజనేయులుగారివంటి వారు రచనలు లోకానికందించారు.

గన్నవరం తాలూకా మంతెన గ్రామ వాస్తవ్యులు కవివంశ సంజాతులు శ్రీ మానికొండ వెంకటేశ్వరరావు గారు వేణుగోపాల, భక్త కల్పద్రుమ శతకాలు తదితర రచన చేసినవారు. అనేక నవలలు నాటకాలు వ్రాసిన రాఘవ వీరి మనుమడు. కవి కూడ.

విజయవాడ వాసులు — శిష్టా లక్ష్మీ కాంత శాస్త్రి గారు – కావ్యాలు - ఖండ కావ్యాలు, విమర్శలు నవలలువ్రాసి అష్టావధానాలుకూడ చేసిన బహు గ్రంథకర్త.

"తెలుగుతల్లి" నాటక కర్త జగమెఱిగిన వేదాంత కవి చిరకాలం విజయవాడలో ఉన్నారు. భావోద్వేగంతో ఆశువు చెప్పే వారు.

## విజయవాడ - బందరు - ప్రాంతం

శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రి సుప్రసిద్ధ భాషా పరిశోధకులు. బందరువారు. మద్రాసు విశ్వవిద్యాలయాంధ్ర భాషా పరిశోధకులు- మల్లాది రామకృష్ణశాస్త్రి గారిదీ బందరే. వారు ప్రసిద్ధ కథకులు.

మొవ్వ శివారుమూలపాలెంలో పుట్టి బందరులో చదువుకొని విజయవాడ-తదితరస్థలాలలో ఉద్యోగంచేసిన "సరసకవి" శ్రీ కేశవభొట్ల సుదర్శన వేణుగోపాలమూర్తిగారు పింగళి వారిశిష్యులు "శతప్రతిష్ఠ", "దాస రామాయణా"ది కృతికర్తలు. విజయవాడ- బందరుమధ్యలో కాటూరు గ్రామవాస్తవ్యులైన మహాకవి కాటూరి వెంకటేశ్వరరావు గారిని వారి సాహితీ విపణిని ఎరగని వారెవరు! గుడి గంటలు మ్రోగించిన భక్తిని ముఖంలో దీప్తిని వెలార్చిన గంభీరుడటు బందరుకీ ఇటు విజయవాడకీ వన్నె తెచ్చాడు. బందరుకీ అవనిగడ్డకీ మధ్య సీమలో జన్మించి బందరులో విద్యాభ్యాసంచేసి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో అధ్యాపకత్వం నెఱపిన శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు కాటూరివారి "గుడిగంట"ల్లాగానే "మధుర పండితరాజం" విడిగా సంతరించిన పండితకవి. తాను "ఉత్తమో త్తమ గురు శిష్యుండనైతి | గురు పునైతిని సచ్ఛిష్యలోకులకును" అని చెప్పుకొన్నారు. శ్రీ శేట్లూరు వెంకట రాఘవ అయ్యంగారు విజయవాడ చరిత్రలో వెలుగు దివ్వెగా వెలిగి "కావ్యాత్మ, అలంకార మంజరి" అనే శాస్త్ర గ్రంథాలతోపాటు పద్యాంధ్రకృతులు కూడ విరచించిలవారట శ్రీ బసవరాజు అప్పారావు పద పద్య కవిత్వాలు రెండూ వెలయించి ఆంధ్రులందరికీ తమ పాటలద్వారా సుపరిచితులైన విజయవాడ వాస్తవ్యులు. శ్రీ అక్కి-పెద్ది సత్యనారాయణగారిది కాయపురం. విజయవాడలో ఉద్యోగంచేసి రామలింగేశ్వర శతకం వ్రాసి కృష్ణరాయలచరిత్ర దానదయాధర్మాది వీరాలు వెల్లడించిన వీరకావ్యంగా రచించారు.

శ్రీ జలసూత్రం రుక్మిణీనాథ (పేరడీ) శాస్త్రి సరసకవి పండిత మండలిని తనలో లీనం చేసికొని వారి పలుకులు తన పలుకులలో మలచి పలికి తలలూపించిన పండితకవి- బందరులో చదివి (చిట్టి గూడూరులో) కన్యకాపరమేశ్వరీ నాటకంవ్రాసివిజయవాడ ఆకాశవాణిని పలికించి అనేక నాటకానాటకాలు చూపించిన నిండైన మనిషి. శ్రీ దోమా వెంకటస్వామి గుప్త, శ్రీమతి కాంచనపల్లి కనకాంబ, శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి గారలు శ్రీ చిల్లా వెంకటరత్నంగారు విజయవాడ వాస్తవ్యులైనవారే. శ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు బందరు వాస్తవ్యులైన వైయాకరణులు. కాయిపురంలో పుట్టి పెరిగి విద్వాంసులై విజయవాడ చేరి కవి సామ్రాట్టుకు సమీపంలో తానొక కవి సమ్రాట్టయి గేయ పద్య కావ్య నిర్మాణంతోపాటు ప్రస్తుతం నవలలు కూడ రచిస్తున్న శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు త్రిలింగదేశం మనదేనంటారు. వారు కృష్ణా మండల నివాసం కావటం వారికీ కృష్ణా మండల కవిలోకానికి కూడ పుష్టి నిచ్చింది.

దీర్ఘాయుష్కులు కాకపోయినా హంపీ క్షేత్రం చూచిన ఉద్వేగాన్ని యథాతథంగా రసబంధురంగా మనకందించిన కొడాలి సుబ్బారావుగారిది చల్లపల్లి దగ్గర పెదకళ్ళేపల్లి-వేటూరి ప్రభాకరశాస్త్రిగారి స్వగ్రామము ఇదే. కవిపండిత విరాజమానమైన కృష్ణాసీమలో జన్మించి ప్రసిద్ధి పొందినవారిలో కొందరినైనా తలచుకొంటున్నామనేది మనకీనాటి సంతృప్తి. మనకందనవారితోనే తదితరులైన మహానుభావులుకూడ మనమాటలు వింటూనే ఉన్నారన్న భావంతోనే యీ నీరాజనం పట్టడం.

శ్రీయుతులు విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుగారు, అరిపిరాల విశ్వం, కొడగంటి రంగకవి, మల్లంపల్లి వీరేశ్వర శర్మ నందివెలుగు వెంకటేశ్వరశర్మ గొట్టిముక్కల రామకృష్ణశాస్త్రి ప్రభృతులీ కృష్ణామండలానికి చెందినవారే. అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు అభినవరామకృష్ణులు. చెరుకుపల్లి జమదగ్నిశర్మగారు శ్రీ శ్రీరాం వీరబ్రహ్మంగారు కప్పా అంజనేయశాస్త్రిగారు మొదలైనవారెందరో సుప్రసిద్ధులు. పువ్వాడ శేషగిరిరావుగారధ్యాపకులైన కవి పాదుషా వీరి ప్రభావం చాలమంది శిష్యుల మీద వ్యాపించింది.

ఆధునిక కాలంలో కృష్ణామండల కవివర్యులు తమతమకలాలు కాలానుకూలంగా నడుపుతూ కవితా వ్యవసాయం సాగించటమే కాక కవితావరామర్శకూడ నవీన దృక్పథంతో వెలయిస్తున్నారు. రచనలు బహు ప్రక్రియలలో వెలువడటం ఎప్పుడో ప్రారంభమయింది. అన్ని ప్రక్రియలలోను రచనలు సాగించిన మన పెద్దల నెందర్నో మనం స్మరించాం. నవలలు, నాటికలు కథలు బాలసాహిత్యం వెలార్చే రచయిత్రి రచయితలీనాడు మన మండలంలో దండిగా పెరిగారు గాని తరగలేదు. సుప్రసిద్ధ రచయిత కొత్త ఆలోచనా సంస్కార వ్యాపకుడు "చలం" ఈ మండలంవాడే. పూసల వెంకటేశ్వరరావుగారు ఆదివిష్ణు మొదలైన నాటకకర్తలతోబాటు సోమంచి రామంగారివంటి కథకులు. శ్రీ టి.ఎల్.కాంతారావుగారివంటి సాహితీ సమీక్షకులు గేయవచన కవితలతోపాటు మినీకవితలు బలంగారచించే కవి కుమారులు మనకున్నారు. శ్రీయుతులు యద్దనపూడి సులోచనారాణి, తెన్నేటి హేమలత, ఇల్లాది వసుంధర, తురగా జానకీరాణి, కారీస్ మొదలైన ప్రసిద్ధ నవలా రచయిత్రులీనాడు తమ ప్రతిభా ప్రకాశాన్ని వెదజల్లుతున్నారు వీరందరికీ కృష్ణామండలి జన్మస్థలం ఈనాడు తాత్వికదృష్టితో కవితా విషయాన్నిగాని కథా వస్తువును గాని పరిశీలించి పదర్శించే ప్రజ్ఞ పంచుకొంటున్న కథకులు కవులు పెరగడం అభినందించ దగిన ఘట్టంగా కృష్ణామండల చరిత్రలో చెప్పుకోదగిన విషయం.

బందరులో ఈనాడు స్పందనసాహితీసమాఖ్య, ఆంధ్రసారస్వత సమితి విజయవాడలో విజయసాహితీ, సాంస్కృతీ సమాఖ్యలూ, ముదునూరులో గోదా గ్రంథముల అవనిగడ్డలో దివిసీమ సాహితీ సమితి ఇంకా ఎన్నో సాహిత్య సంస్థలు జిల్లాలో విశిష్టంగా కృషి చేస్తూ నూతనరచయితల కుత్తేజం కలిగిస్తున్నాయి. గుడివాడ పండితులను కవులను గురించి సత్కరించిన సంస్కారం సంప్రదాయంగల పట్టణం-అక్కడ బాలబంధు బి. వి. నరసింహారావుగారు, మధుర కవి కాకాని నరసింహారావుగారు మొదలయిన వారున్నారు శ్రీ త్రిపురనేని వెంకటేశ్వర రావుగారు తాము గొప్ప రచయితగా పేరు పొందినవారు. ఇలా ఎందరో రచయితలు కృష్ణా మండలంలో నాడు నేడు ఉన్నారు. వీరి పురోగమనం కృష్ణామండలి పురోగమనంగా గమనిద్దాం. ఈ శుభసమయంలో అందరికీ వందనాలు.

* *

# తెలుగు నాటకరంగ రచన పరిణామ క్రమం

— మైత్రేయ

తెలుగు జాతి నేడు భారతదేశంలో రెండవ స్థానం ఆక్రమించింది. తెలుగుజాతికి ప్రత్యేక కళారూపాలున్నాయి. సాహితీ ప్రపంచంలో గొప్ప గుర్తింపు, నాటక ప్రపంచంలో గొప్ప ఆధిక్యత వున్నాయి. కాని తెలుగుజాతికి ఒక మహానగరంలేని లోపంవల్ల పాలనలో ప్లానింగ్‌లో వెనుకబాటుతనం వల్ల నాటకకళ ఎదగదగిన మేరకు ఎదగలేదు. కాని దేశంలో పలుప్రాంతాలలో తెలుగునాటక సమాజాలు ప్రదర్శనలిస్తున్నాయి.

కలకత్తానగరం—వల్ల బెంగాల్ నాటకరంగం, బొంబాయినగరం వల్ల మరాఠీ నాటకరంగం, మైసూరు బెంగుళూరు నగరాల వల్ల కన్నడ నాటకరంగం, మద్రాసు నగరంవల్ల తమిళ నాటకరంగం విస్తరించాయి. వాటి ఛాయలు తెలుగు నాటకరంగంపై ప్రసరించాయి.

## పూర్వ చరిత్ర

నాటకం అనే ప్రక్రియ నేడు వాడుతున్న విధంగా భారతదేశ చరిత్రలో సాహిత్యంలో మనకు కానరాదు. భారతదేశచరిత్రలో ఎక్కడా 'ఏ తెగకు ప్రత్యేక నాట్యశాస్త్రం లేదు. అందరికీ భారత మహాముని నాట్య వేదమే శిరోధార్యం.

తెలుగులకు సంక్రమించిన సంస్కృతి 'ఆంధ్ర' పరంగా సంక్రమించి విస్తరించింది. మొటమొదట దక్షిణభారతంలో క్రీ. పూ. 250 నాటి పల్లవశాసనంలో 'ఆంధ్రపథము' అనుమాట లభ్యమయింది.

క్రీ. పూ. 700 ప్రాంతంలో ఆంధ్రులలో ఒక తెగ యమునా నదీ తీరప్రాంతాలలో వున్నట్లు, ఆపస్తంభునిగురూత్వంలో అది మనినట్లూ, చరిత్రకారులు తెలిపారు క్రిమేపీ వీరు, వింధ్యదాటి దక్షిణంగా పయనించి గోదావరి, కృష్ణానదీ ప్రాంతాలలో స్థిరపడినట్లు ద్రావిడ జాతులైన నాగులు, యక్షులు, జక్కులు, కాళింగులు తెగలలో కలసిపోయి ఆపస్తంభుని ఆదిఋషిగా మూలఋషిగా ఆరాధిస్తూ తెలుగు జాతిలో లీనమైపోయింది. కానిఏది తెలుగుసంస్కృతి అవతరించిన పట్టమో అంతగా చరిత్ర పుటల్లో లభ్యం కావటం లేదు

ఆంధ్ర జాతికి అత్యంత ప్రాచీన సాహిత్యనిధి పైశాచిభాష. 'బృహత్కథ', గాథాసప్తశతి' లకు వెలుగు చూపిన కవితా సంపద. సంస్కృతానికి దీటుగా తన భాషను నిలపుకున్న స్వర్ణయుగమది.

ఆ దశలో తెలుగు దేశాన-'కురవంజి' అనే తెగ నాటక రూపంలో లీనమైన నృత్య-గాన-కథావిశేషణం సృష్టించింది. అది సంస్కరింపబడియక్షగానంగా అవతరించింది. అది వీధినాటకంగా ప్రజలలో చిర స్థాయినందించి, ఈ దశలో రచన పరంగా నాటకం సృషించబడక మౌఖికంగా వాగ్గేయరూపంగా అవతరించి చిరంజీవిగా వర్థిల్లింది.

12 వ శతాబ్దంలో పలనాటిసీమను పాలించిన నలగామరాజు ఆస్థానంలో నాటకులు రాజమందిరంలో ప్రదర్శన ఇచ్చినట్లున్నది. ఇది నేటి భోగంవారి మేజువాణిలో ఏర్పరించబడివుంది. వెనుక దిశన వాద్యకారులు నిలవడ యువతులు ముందుకు వచ్చి కథాంశం గానం చేయటం వర్ణించబడింది. ఇది శ్రీనాథకవిరాజు రచించిన ద్విపదకావ్యం 'పల్నాటి చరిత్ర'లో కానవస్తున్నది.

13 వ శతాబ్దిలో అవతరించిన పండితారాధ్య చరిత్రద్వారా ఆనాటికి వీధిభాగవతం అనే నాటిక ప్రక్రియ ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తున్నది.

తరువాత సిద్ధేంద్రయోగి రచించి నేర్పిన కూచిపూడి వీధి భాగవతం చారిత్రక ఆధారంగా

ప్రత్యక్ష సాక్ష్యంగా మన ముందున్నది. దీని పరోక్ష రూపాలు భామాకలాపం, యక్షగానంగా ప్రసిద్ధంగా వున్నాయి.

## వర్తమాన చరిత్ర

దేవాలయ మంటపాల్లో, నగరవీధుల కూడలిలో నాల్గుదిక్కుల ప్రేక్షకులు వుండి చూచే నాటక ప్రక్రియ. బ్రిటిష్-ఫ్రెంచి సంప్రదాయాల వరవడిలో పడి ఒకచోట తెరల మధ్య నాటక ప్రదర్శనం జరగటం ఎదురుగ విస్తరించిన సభ వుండటంగా నేటి నాటకం-దాని రంగస్థలి రూపు దిద్దుకున్నాయి.

మనకు స్పష్టమయిన నాటక రచనా పరిణామ క్రమం 1880 నుండి మాత్రమే లభ్యం అవుతున్నది. ఈ నాటక రచనలకు ఆలంబన సంస్కృత మహా కవుల నాటక రచనలు.

మహాకవి భాసుడు, మహాకవి కాళిదాసు, శీలాదిత్య హర్షవర్ధనుడు రచించిన నాటకాలు నేరుగా తర్జుమా చేయబడినాయి. వ్యాస విరచిత మహాభారత కథాంశాలు-వాల్మీకి విరచిత రామాయణ కథాంశాలు గాక, అనేక పురాణగాథలు తెలుగు నాటక రంగానికి పుష్టిని స్ఫూర్తిని ఇచ్చాయి.

భారత కథా వస్తువులు కథా - కవితా రీతుల్లో ప్రపంచాన్ని ఆకర్షించిన అభిజ్ఞానశాకుంతలం, ఉత్తర రామచరిత్ర, మృచ్ఛకటిక, ముద్రారాక్షసం నాటకాలు తెలుగు కవుల నాటక రచనలకు మూల పాఠాలుగా మూర్తికట్టాయి,

19వ శతాబ్ది అంత్యంలో బ్రిటీషువారు పరాయి సీమ నుంచి వచ్చి పరిపాలన హస్తగతం చేసుకుని తమ ధర్మాల్ని-తమ మతాన్ని తమ రాజ్య పాలన సూత్రాల్ని ప్రవేశపెట్టడాన్ని బాలగంగాధర తిలక్ మహాశయుడు వ్యతిరేకిస్తూ ఇచ్చిన పిలుపు మహారాష్ట్ర రంగస్థలంలో చారిత్రక నాటక సృష్టికి ఆలంబన అయింది. అది పశ్చిమభారతాన ఆంధ్ర ప్రాంతమైన బళ్ళారిలోగల తెలుగుకవులకు స్ఫూర్తినిచ్చింది ఆదశలో కోలాచలం శ్రీనివాసమూర్తి, ధర్మవరం కృష్ణమాచార్యులు తెలుగు నాటక చరిత్రకు ఆద్యులు కావడానికి ఆధారాలయినాయి. ఇటు తూర్పు భారతాన బెంగాలుదేశంలో ఈస్టిండియా కంపెనీ పాలన, తరువాత బ్రిటిషు రాణి పాలనకు వ్యతిరేకంగా బెంగాల్లో బయలుదేరిన నాటక రంగంలోని కథాంశాల వరవడి తెలుగునాటకవతరించింది. చిలకమర్తిలక్ష్మీనరసింహం గారు, పానుగంటి లక్ష్మీనరసింహారావులతోపాటు ఆ తరం కవుల రచనలకు ప్రేరణనిచ్చాయి. వాటికవులు రాజ్యాంగాన్ని పూర్తిగా ధిక్కరించలేక భక్తిచాటున, దేశభక్తిచాటున దైవాన్ని, చరిత్రను నాటక కథలకు తీసుకున్నారు. 20 వ శతాబ్ది ప్రారంభ దినాలలో చెప్పుకోదగిన సంఖ్యలో నాటక రచయితలు రచనలు తెలుగునాటక రంగానికి అందించారు. నాటి పౌరాణికనాటకాలే నేటికి నాటక రంగానికి ఆధారంగా వున్నాయి. మార్పులేని ఎదుగులేని పద్య నాటకాలు ప్రదర్శనలో రచనలో నవ్యరీతుల కోరుకునేవారి విమర్శలకు గురవుతున్నాయి.

సాంఘిక కథావస్తువు-ప్రజల వ్యవహారిక భాష-నిత్యజీవితసత్యాలు-బాల్యవివాహాలు-కన్యాశుల్కాలను ఖండిస్తూ ఓ మహానాటకంగా కన్యాశుల్కం అవతరించింది. దాని స్రష్ట మహాకవి గురజాడ అప్పారావు. సాంఘిక నాటక రచయితలకు మార్గదర్శకులయ్యారు. నాటినుంచి మాత్రమే మన నాటక రచన పరిణామక్రమాన్ని విశ్లేషించగలుగుతున్నాం.

తొలిత తెలుగు నాటక రచనను కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రారంభించారు. అది పూర్తిగా తన మహిళా పునర్వివాహ ఉద్యమానికి పరిమితమైనట్లుగా భావించబడింది. ఆ తరువాత కాలంలో గురజాడ, చిలకమర్తి, పానుగంటి, మరి కొందరు మహనీయులు నాటక రచన సాగించారు. ఆ కాలంలో బళ్ళారి శిరోమణిగా ప్రకాశించింది. విజయనగరం, రాజమండ్రి, కాకినాడ, విజయవాడ, గుంటూరు, అనంతపురం వగైరా అనేక ప్రాంతాలు నాటక సమాజాలు స్థాపించి, రంగస్థలం నిర్మించి, నాటక రచనలు ప్రోత్సహించి చరిత్ర సృష్టించారు. ఇది అరవై ఏళ్ళక్రితం సంగతి.

ఆరవై ఏళ్ళ కాలంలో తిరుపతి వేంకట కవులు సంస్కృత నాటకాలను తమ ఆశు కవితా ధారలో ఓలలాడించి తెలుగు నాటకరంగ పొత్తిళ్ళలో లాలించి పాలించి పెంపొందించారు.

బళ్ళారి తిరువెంగళ రాఘవాచారి విజయవాడలోని మైలవరం థియేటర్సులో రచయితగా, దర్శకుడిగా, శిక్షకుడుగా ఎనలేని కృషిచేసి ప్రయోగంలో గొప్ప రీతిని సృష్టించారు. ఆ కాలంలో ముత్తరాజు సుబ్బారావుగారు 'పారిజాతాపహరణం' కథావస్తువును మరాఠీ నాటక ప్రభావంతో మరి కొంత ముందుకు తీసుకుపోయి శ్రీకృష్ణ తులాభారం రచించారు. అందులోగల అతి చమత్కారం సత్యభామ కృష్ణుని భర్తృదానంగా నారదునికి ఇవ్వగా అతను కృష్ణుని వీధులవెంట తిప్పి భలే మంచి చౌక బేరము అని అమ్మచూపడం. ఇదే నేటికి జీవించి వున్న తెలుగు నాటకం.

నాటక రచనలో ధమిడిపాటి కామేశ్వరరావు, శాళ్ళకూరి నారాయణరావుల ప్రవేశంతో నాటక రచన రంగం-నరి కొత్త పుష్టిని సంపాదించుకున్నాయి. సాంఘిక సమస్యలపై న-రక్త సంబంధం కన్న ఆర్థిక సంబంధమిన్నకావడంపై చురకలు ప్రారంభమైనాయి.

ఇంతవరకూ నడచిన నాటక రంగ-రచనలలో దైవభక్తి, దేశభక్తి, పతిభక్తి, ధర్మనియతి ప్రధాన పాత్ర వహించాయి.

## ఆధునిక యుగం

రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభంతో హిట్లరుఫాసిజం ప్రపంచాధిపత్యంకోసం దాడి ప్రారంభించడంతో మిగతా ప్రపంచం ఏకమయింది. ఆ దశలో ప్రజా నాట్యమండలి ఆంధ్రదేశంలో అవతరించింది. సుంకర సత్యనారాయణ, వాశిరెడ్డి భాస్కరరావులు ముందడుగు అవనింద, మాభూమి నాటకాలు వ్రాసి నాటకరచనలో రైతుల సమస్యలు, జమీందారీ సమస్యలు, ముక్కోటి ఆంధ్రులు ఏకంకావాలని, సంస్కార భావాలు రాజకీయ ప్రభావాలు ప్రవేశపెట్టారు. చాప్పరపు సుబ్బారావుగారు 'రోషనార' 'తారాశశాంకం' 'ఇనుప తెరలు' మరికొన్ని నాటకాలు వ్రాసి చారిత్రక విధానంలో జాతి విశిష్టత, పౌరాణిక నాటకాలలో సంస్కార భావాలు, సాంఘిక నాటకాలలో పెట్టుబడిదారి వ్యవస్థ దౌష్ట్యాలు పరిచయం చేశారు. బోయి భీమన్న 'కూలిరాజు' 'పాలేరు' వంటి మరికొన్ని నాటకాలు వ్రాసి వెనుకబడిన జాతులనుంచి విద్యాబుద్ధులు నేర్చిన యువకు అధికారంలోకి రావడం చాటి చెప్పారు. వీరి ఆలోచన వెనుక బ్రిటిష్ పాలన-అమెరికన్ మిషన్సు సహకారంలో క్రైస్తవులకుగల అవకాశాలు చోటు చేసుకున్నాయి.

త్రిపురనేని రామస్వామి చౌదరి ఆర్య ద్రావిడ వైరుధ్యాన్ని ఎత్తి చూపి ద్రావిడ వాదానికి తన రచనలలో తావిచ్చారు. 'ఖూనీ', 'శంబుకవధ' నాటకాల ద్వారా ఒకతరగతి మధ్యతరగతి ప్రేక్షకులలో సంచలనం తెచ్చారు.

ఒక్క నాటకంతో సాంఘిక నాటక రచనకు మార్గదర్శకులైన గురజాడ తరువాత ఒక ప్రముఖస్థానాన్ని ఆచార్య ఆత్రేయ సంపాదించారు. మానవతా దృక్పధాన్ని పెంపొందించే రీతిలో 'గౌతమబుద్ధ' నాటకం వ్రాసి సమర్థవంతంగా ప్రదర్శించారు. వాడుఆయనకు కమ్యూనిస్టు ఉద్యమంతో పరిచయం కలిగి, రచయితగా ఆయనలో ఒక పరివర్తన కలిగింది. 'పరివర్తన' 'ఎన్. జి వో', 'ఈనాడు' నాటకాలు వ్రాసి నాటక రంగంలో రచనలో, కొత్త వరవడి ప్రవేశ పెట్టారాయన.

గ్రామీణ జీవితంపై, మధ్య తరగతి జీవితాల అనిశెట్టి నాటకాలు వ్రాశారు. 'గాలిమేడలు' 'మావూరు' పేరుపొందాయి.

పినిశెట్టి 'కులంలేనిపిల్ల' 'పల్లెపడుచు' రాసి ప్రజాదరణ పొందారు.

సాంఘిక నాటకాలకు, రంగస్థలానికి గౌరవాన్ని శాశ్వతాన్నికోరుతూ ఆలోచనలో ఒక విప్లవపధాన్ని ప్రవేశపెట్టిన మహానటుడు బళ్ళారి రాఘవ,రచయిత

పాకాల రాజమన్నార్‌లు స్త్రీని గౌరవించాలని-వృద్ధులు యువతులను వివాహం చేసుకోరాదని - స్వేచ్ఛా వివాహాలు ఆవశ్యం అనే దృష్టితో రచనలు ప్రదర్శనలు చేశారు. రాఘవ 'పరిపడని సంగతులు' మనోవిశ్లేషణకు నాటక రూపం ఇచ్చారు. వారు నాటక రంగం.రచనలలో ఒకదశకు విశిష్ట స్థానం సంపాదించారు.

తరువాత దశలో నాటక - నాటికలకు రేడియో ప్రధాన కేంద్రమయింది. రేడియో నాటికలు, నృత్య నాటికలు, వీధినాటకాలు, కూచిపూడి నాటకం, సంభాషణల నాటకం, పద్యనాటకం, టీవీ నాటకాలు వచ్చి పరిణామ క్రమానికి చాలా వేగాన్ని చేకూర్చాయి.సాంకేతిక నైపుణ్యం సైన్సు తెచ్చిన మార్పువల్ల సకల నాటక–రూపక సాహిత్యాల్ని సినిమా ప్రదర్శించ నారంభించింది. ఈ దశలో సినిమానంటి నాటకాలు వచ్చాయి. నాటకాల కథాంశం సినిమా జీర్ణించుకుంది. నడుస్తున్న దశకాల్లో గొల్లపూడి మారుతీరావు రేడియోద్వారా నాటక రచయితగా అవతరించాడు. తూర్పు ఆంధ్రులజీవితాలకు అద్దంపట్టి కాశీవిశ్వనాధ్-రచయితగా వచ్చారు. నాలుగు దశాబ్దాల నాటక రచయితగా అనేక అంశాలను రూపకల్పన చేసిన విశిష్ట రచయిత కొర్రపాటి గంగాధరరావు శతాధికనాటకాలు వ్రాసి ఒక చరిత్ర సృష్టించారు.

## నేటిదశ

వృత్తినాటకాలు ఆడేవారికి క్రొత్త రచనలు లేవు అరవై ఏళ్ళనాటి మహా రచయితలు రచించి నాడు సంగీతం కూర్చిన నాటకాలే ఆడుకుంటూ తమ రంగానికి ఎదురు బొదుగు లేదని నిరూపించారు.

రాజకీయాలలో బేలన్సు తప్పిన రచయితలు–'కమిటెడ్' పదం వెనుక పథం అందుకొన్న కొందరు రచయితలు, విప్లవం ముసుగులో సాహిత్యంలో బూతులు చేర్చి నాటకంలో వేగం పెంచి పేదవాడిని తొందరపాటుతనంతో ధనికవర్గంపైకి ఎగదోసే కథా వస్తువులు సృష్టిస్తున్నారు. సమాయత్తత లేని పోరాటాలే శరణ్యం అన్న అర్థం కల్పించారు.

ఆధునిక సాహిత్యంతో సంబంధం కలిగి-ప్రాచీన నాటక సాహిత్యపు విలువ తెలిసి-భవిష్యత్తును నిర్దేశించగలశక్తిగల రచయితలు సాగుతున్న చరిత్రను, వర్తమాన సమాజంలో వున్న వర్గసంకరాన్ని-సంఘర్షణల శక్తిని-రైతు-కార్మికుడు-ఉద్యోగి వర్గాల శక్తులను సక్రమంగా బేరీజు వేసి-వామ పక్ష శక్తుల ఏకీకరణను వర్గరహిత సామాజిక పరివర్తనకు ఉపకరించే కథాంశాలను నాటకాలుగా తేవలసిన ఆవశ్యకత వుంది.

పద్యం రాయలేనివారు పద్యం పాడలేనివారు పద్య నాటకాలపై విమర్శలు విసరడం సాంఘిక నాటకం ప్రజల నాకర్షించాలనే భ్రమతో మెలోడ్రామాను పెంచి సందేశాన్ని సంభ్రమం మింగివేసే ప్రయోగాలుచేయడం-నాటకానికి ఆయువు పట్టయిన సంఘర్షణ-సందేశం-సోషలిస్టు వాస్తవికతను కళాత్మకంగా చెప్పగల నేర్పు కొరవడి వుంది.

ఈ దశనుంచి ప్రపంచ నాటక చరిత్ర, తెలుగు నాటక చరిత్ర అధ్యయనం చేయటం ద్వారా తెలుగు నాటకరంగ పరిణామ క్రమంలో ఆధునికతను సృష్టించటంద్వారా పద్య-నృత్య-వచనాటిక ప్రయోగాల్ని విభిన్న రీతుల్లో జీవింప చేయాల్సిన ఆవశ్యకత మన ముందు వున్నది. అలా కాక ఇంగ్లీషు నాటకానికి కాపీ బ్రతుకు అలవాటు చేసుకుంటే నేటి వరకు ట్రాన్స్‌లేషన్-ఇమిటేషన్‌గా నాటక రచనకు చరిత్ర గతిలో ఏర్పడ్డ స్థానం తెలుగు నాటకాన్ని అఖాతంలోకి తోసే ప్రమాదం వుంది.

బ్రతుకుతెరువు నేర్పిన రచయితలు తెలియని విరాయటం-స్త్రీని సంఘం హింసిస్తున్నదని చెప్పటానికి రంగంపై స్త్రీ పాత్రను హింసించడం నేటి అనారోగ్య లక్షణాల్లో ప్రధానమైనవి. ఉత్తమ ప్రయోగ రీతుల పేర అర్థంలేని సస్పెన్స్ వచ్చింది. స్వార్థపు ఆలోచనల వెనుక వివాదం పెరిగింది. మతా తత్వాల వల్ల స్వార్థం పెరిగింది. తెలుగు నాటక పరిణామ క్రమంలో ఆరోగ్య క్రమం పెరగడానికి సమిష్టి ఆలోచన-సమిష్టి కృషి-సోషలిస్టు వాస్తవిక దృష్టికి శోధన-శాస్త్రీయమైన మార్గంలో పయనం అవసరం.

* *

# 'సాహితీ కాలుష్యం'

ద్వా.నా. శాస్త్రి

వాతావరణ కాలుష్యం, ధ్వని కాలుష్యం లాగా సాహితీ కాలుష్యంకూడా లేక పోలేదు. ఈసాహితీ కాలుష్యం జాతిమీద 'స్లో పాయిజన్' లాగా పని చేయగలదు. తెలుగు దేశంమీద తెలుగు భాష మీద, తెలుగు సాహిత్యంమీద నిజమైనఅభిమానం వున్నవాడు ఈ సాహితీ కాలుష్యాన్ని గురించి జాగ్రత్తపడాలి. అంతేకాదు–నివారణకు ప్రతి తెలుగువాడూ చిత్తశుద్ధితో నడుం బిగించాలి. చేతులు కాలకముందే ఆకుల్ని పట్టుకోనగల సమయోచిత బుద్ధిని అలవరచుకోవాలి.

ఈనాటి సాహితీరంగం యావత్తూ కలుషితమైపోయిందనటం సాహసమే అవుతుంది. అలాగని సాహితీరంగం మూడు పూవులూ ఆరు కాయలుగా దిన దిన ప్రవర్ధమానమవుతోంది అనటం ఆత్మవంచన కాక తప్పదు. ఇలా అనడం 'గోడమీద పిల్లివాటం' అనుకోవటం తొందరపాటవుతుంది. మొత్తం మీద నా అభిప్రాయం ఏమిటంటే మంచి సాహిత్యంతోపాటు కొన్ని అనారోగ్య ధోరణులుకూడా ప్రబలుతున్నాయనేదే. ఈ అనారోగ్య లక్షణాలను వివరంగా తెలుపుతాను.

నేటి సాహితీలోకంలో స్పష్టంగాకనిపించే అనారోగ్యం ఏమిటంటే 'సిద్ధాంతాల రాద్ధాంతం'. సంప్రదాయవాదులు, ఆధునిక వాదులు అని రెండు వర్గాలు. ఆధునిక వాదుల్లో మార్క్సిస్టులు, అనుభూతివాదులు సాయుధ విప్లవవాదులు అని మళ్ళీ వర్గాలు. 'సంప్రదాయవాదులు' అని కొందరు కొందరికి ముద్రవేస్తే 'ఆధునిక వాదులు' అని ఇంకొందరు ఇంకొందరికి ముద్రవేస్తారు. ఈ ముద్రలు ఎలా, ఎందుకు వేయబడతాయో అనూహ్యం. సంప్రదాయ వాదుల సభలకి ఆధునికులు, ఆధునికుల సభలకి సంప్రదాయ వాదులు ఆహ్వానించబడరు. ఆహ్వానించబడ్డా వెళ్ళరుకూడా. ఈ విధంగా వీళ్ళు పరస్పర ద్వేషులని చెప్పాల్సిందే, ఇదే విధంగా మిగిలిన వర్గాలుకూడా. సాహితీ సంఘాల పరిస్థితికూడా ఇందుకు భిన్నంగా లేదు. అ.ర.సం వాళ్ళంటే వి.ర.సం వాళ్ళకిగిట్టదు. అలాగే విరసం వాళ్ళంటే అరసం వాళ్ళకీను. మార్క్సిజం చదివినవాడే, మార్క్సిస్టు దృక్పథంతో రాసినవాడే రచయిత అని కొందరు మైకుల్లో దంచుతూంటే, అలంకారిక పద్ధతిలో పద్యరచన చేసినవాడే కవి అని మరికొందరు బల్లగుద్ది వాదిస్తూంటే, ఇంకొందరు సాయుధ విప్లవాన్ని రేకెత్తించేట్లు రాస్తేనే మహా రచయిత అని ఉపన్యాస విన్యాసం చేస్తూంటే–ఈ సిద్ధాంతాల రాపిడికి తెలుగు సాహిత్యం ఉక్కిరి బిక్కిరయి క్షీణించిపోతోంది. రచయితకి స్వేచ్ఛచచ్చిపోతోంది. 'కమిట్‌మెంట్' ఉండాలంటూ ఏ వర్గంవారు ఆ వర్గపు రచయితచేత బలవంతంగా కమిట్ చేయిస్తున్నారు. అంటే ఏదో ఒక సిద్ధాంతానికి బానిసయితేగాని విలువపడని దుస్థితి

దాపురిస్తూంది. ఇంకా స్పష్టంగా వివరంగా చెప్పాలంటే ఈనాటి రచయితలకి 'బ్రైన్ వాష్' తప్పనిసరై పోతోంది. రచయిత కలం స్వంత కలం కాకుండా 'అద్దె కలం' అవుతోంది. అద్దెగా 'స్వంత భావాల్ని' చెల్లిస్తున్నారు.

పోనీ విమర్శనారంగంఅయినా శుభ్రంగా వుందా అంటే లేదన్న సమాధానమేవస్తుంది విమర్శకులకి అహంకారం జాస్తి అయింది. మమకార వికారాలు అభిమానాలయ్యాయి. స్వపరభేదాలు రెండు కళ్లు అయ్యాయి. అవసరాలు విమర్శకుల్ని నిర్వీర్యుల్ని చేస్తున్నాయి. ఎక్కడైనా సద్విమర్శకుడు వున్నాడూఅంటే అతగాడ్ని ఎలా నాశనం చెయ్యాలో, ఎంత అంథఃపాతాళానికి తొక్కాలో అంత పనీ చేసేస్తున్నారు. సద్విమర్శను మెచ్చుకోవటం పోయి నొచ్చుకొంటున్న కలికాలం ఇది. ఈ బాధలు కొనితెచ్చుకొనే కోరిక లేకపోవడం వల్ల నేటి విమర్శకులు పుస్తకాన్ని బట్టి కాకుండా రచయితనుబట్టి విమర్శించడానికి ఉత్సాహం చూపిస్తున్నారు. పేరున్న రచయిత రాసింది 'చెత్త' అయినా 'ఓహో' అనటం, పేరులేని యువ రచయిత బాగా రాసినా రంధ్రాన్వేషణ చేస్తూ చివరలో 'ఏమైనా ముందు ముందు మంచి రచనలు చెయ్యగలడని ఆశిద్దాం' అనే ముక్తాయింపుతో విమర్శను ముగించడం ఈ నాటి ఆచారమైపోయింది. మంచివిమర్శను ప్రచురించే పత్రికలూ కనపడవు. పత్రికలలో ప్రామాణిక రచనలకన్నా అప్రామాణికాలకి, టుమ్రీలకి ప్రాముఖ్యత ఇవ్వబడుతోంది. పత్రికలవాళ్ళు కూడా 'పేరు'నుబట్టిమాత్రమే రచనల్ని ప్రచురిస్తారు పేరున్న రచయితల రచనల్ని ప్రచురించడం ఒక 'క్రేజ్' అయిపోయింది-అవెంత తుక్కయినా సరే! కొన్ని కొన్ని పత్రికలకి 'ఆస్థానరచయితలు'కూడా లేకపోలేదు. సాహిత్య పత్రికలు కూడా మామూలు పత్రికల స్థాయిలోనే వుంటున్నాయి. సమీక్షకులుగా ఒకరో ఇద్దరో నియమిస్తారు. పేజీల నిబంధన కూడా నియమించే అలవాటుంది. ఈ విధంగా విమర్శనారంగం కూడా కలుషితమైపోయింది.

రచయితలమనస్తత్వాలుకూడా పరిశుభ్రతకి నోచుకోలేక. వాళ్ళ బుద్ధులు కూడా వక్రంగానే వున్నాయి. పరస్పర ద్వేషభావం చాలామంది రచయితలకి ఊపిరి, 'కీర్తి' గుండెకాయ, వ్యాపారం ధ్యేయం. ఇన్ని దుర్గుణాలతో రచయితలు పరస్పరం పోటీ పడుతున్నారు. కీర్తికాంతకోసం 'నిజాయితీ భార్య'కి విడాకులిచ్చి అడ్డమైన దారులూ తొక్కేస్తున్నారు. మానాభిమానాల్ని విసర్జించేస్తున్నారు. బిరుదులకోసం, సన్మానాల కోసం 'పదండి ముందుకు తోసుకు పోదాం' అంటున్నారు. ఎవర్ని, ఎప్పుడు, ఎలా పట్టుకుంటే "పేరు పాకిపోతుందో అప్పుడు, అలా అతగాడ్ని పట్టుకొంటున్నారు ఈ పట్టుకోవటాల" పోరాటంలో సాహిత్యానికి నువ్వులు నీళ్ళు వదులుతున్నారు. చదివి రాద్దామని కాకుండా-కనీసం విని రాద్దామని కూడా లేకుండా ఏదో ఒకటి రాయాలని రాసేస్తున్నారు. వేసేవారున్నారు కదా అని రాస్తున్నారు తమ వర్గంవారు భజన చెయ్యక పోతారా అని రాసేస్తున్నారు. రాయకపోతే బాగుండదని రాస్తున్నారు, ఆవిష్కరణ సభల జాతర మనందరికీ తెలిసిందే. పీఠికల, ముందుమాటల "డప్పులు" మనం వింటున్నవే! సాహిత్య సభలలో సాహిత్యం రాని వారి ఆదేశాలను పాటించడం, వారి ఉపన్యాసానికి చప్పట్లు కొట్టడం, రచయితలు మైకులు పట్టుకొని వదలకపోవటం, ప్రతి రచయితా 'సర్వజ్ఞుడ్ని' అనుకోవటం, కొండొకచో దూషణే కాకుండా కుస్తీలు పట్టుకోవటం, కవి సమ్మేళనాలలో శ్రోతలు కంటె కవులే ఎక్కువగా వుండటం .... ఇవన్నీ అనారోగ్యకరమైన లక్షణాలే. అందుకే ఈనాటి సాహితీరంగం కలుషితమై పోతోంది అంటున్నాను!

# ప్రతీక నాటక రచన

— పురాణపండ రంగనాథ్

'కన్యాశుల్కం' తర్వాత అంత మంచి తెలుగు నాటకం అవతరించలేదని, పౌరాణిక, చారిత్రక యితివృత్తాలలో నాటకరచనలో కొత్తప్రయోగాలు కరువైనాయని విమర్శలుతరచుగా వినిపిస్తున్నాయి అంటే తెలుగు నాటకరంగం 'కుడితిలో ఎలుక' అయిందన్న మాట. ఇందుకు కారణాలు అనేకం. సినిమాల ప్రభావం అని అందరూ అంటున్నారు. కాని హిందీసినిమా రంగానికి ఆటపట్టయిన బొంబాయిలో మరాఠి నాటకం సహస్ర ముఖాలుగావిలసిల్లుతోంది. విజయ్ టెండూల్కర్ ఎన్నో దృశ్య కావ్యప్రయోగాలు చేశారు. అవార్డుచిత్రాల కన్నడ సీమలో ఆధునిక రంగస్థలం వేయి విధాలుగా పురోగమించింది. గిరీశ్ కర్నాడ్ నాటకాలు ఇందుకు ఉదాహరణలు. తెలుగు, తమిళ, కన్నడ, మళయాళ చిత్రాల నిర్మాణ కేంద్రం మద్రాసు. అక్కడ తమిళ నాటకం ఎంతో ముందంజ వేసింది. 'చో' రామస్వామి నాటకాల ప్రదర్శన ఇందుకు ఉపపత్తి. అందుచేత సినిమా ప్రభావం వల్ల నాటకం కళ దెబ్బతింది అనడం- మన పలాయన వాదానికి, చిత్తశుద్ధి లోపానికి, ప్రయత్న ప్రయోగవాదరాహిత్యానికి; ఆత్మవిమర్శ లేక పోవడానికి దివిటి.

తెలుగు నాటక రంగం ఆధునిక రంగస్థల ప్రయోగాలు సాధించుకోనలేక పోవడానికి వృత్తి నాటక సమాజాలు లేక పోవడమే ప్రధాన కారణం.

పరిషత్తులూ, పోటీలూ పేరిట కొంత కృషి జరిగినా, ఈ ప్రయత్నం చాలకపోవడం నటుల్లో తపనకు బదులు 'కీర్తిలాలస' 'ప్రచారప్రియ' పెరగడం కూడా కారణాలే అనకతప్పదు. రచయితలూ ఇందుకు మినహాయింపు కారు.

వేగంగా పురోగమిస్తున్న ప్రపంచం పోకడలను, తన చుట్టు మనుష్యుల అంతరంగఘోషని లోతుగా పరిశీలించేప్రయత్నం రచయిత చేయక పోవడంవల్ల తెలుగు నాటకరంగం మూస కట్టులో "బందీ" అయింది.

ఐతే కలంలో వేడి, ప్రదర్శనలో వాడి. బుర్రకు పదును పెట్టే లక్షణంఉన్న నాటకాలు రాక పోలేదు. మరో మొహంజొదారో, త్రిజాకీయమదర్శనం, ఈ కోవకు చెందినవి. ఇలాగే వీరేంద్రనాథ్ వినిపించిన రుద్రవీణ.

కాగా అధివాస్తవికత అన్ని రంగాలలో చోటుచేసుకొంటున్నప్పటికీ నాటకరచనలో ఈ ప్రయోగం జరగకపోవడం శోచనీయం.

అయితే మహాకవి శ్రీశ్రీ "చతురస్రం" నాటిక ప్రత్యేక నాటిక అనుకొంటే ఆ తర్వాత ఉతరహారూపకాలు వెలువడలేదనే చెప్పాలి. ప్రతీక రూపకం, నాటకంగురించిన విశ్లేషణకు ముందు శ్రీశ్రీ చతురస్రం లేదా 1+1=1 అనే సంపుటిలోని కొన్ని నాటికలను స్పృశిద్దాం. దానిబట్టి 'ప్రతీకనాటిక' ప్రక్రియకు ఒక నిర్వచనం చేయడాని ప్రయత్నిద్దాం.

## అవి అక్షర స్ఫటికాలు

మహా ప్రస్థానం మహాకవి శ్రీశ్రీ అనల్పభావనా సౌందర్యంతో శబ్దరూపకాలు రచించిన స్రష్టకూడా. ఆయన లేఖిని వెలువరించిన దృశ్య కావ్యాలు మహాకవి దర్శించిన సమధర్మ రమ్య సమాజానికి మణిదీపాలు. కవితా రసాస్వాదన ప్రియంభావుకులకు రాజకీయ కాలుష్యం అంటని అక్షర స్ఫటికాలు అవి.

చతురస్రం లేదా 1+1=1 అనే పేరున వెలువడినసంపుటిలో 11 నాటికలున్నాయి. అవి అన్నీ ఆకాశవాణి ప్రసారం చేసినవే.

చతురస్రం నాటిక ఒక సాంకేతిక ప్రయోగం. అనల్పభావన, శబ్దచమత్కృతి నందిన ప్రతీకనాటిక అది. ఈ నాటికలో పాత్రల పేర్లు జ్ఞానం, సిరి, రాజ్యం, కళ-విజ్ఞానం, కవిత్వం, రాజకీయం, సౌందర్యం-అనే భావాలకు వరుసగా ప్రతీకలు. ఇవి పరస్పర విరుద్ధమైన తత్వాలు. ఒక దానితో రెండవ దానికి ఎక్కడా సాన్నిహిత్యంలేదు. సారూప్యం లేదు, అందుకే ఇది 'అసమ భావ' చతురస్రం, దీనిని 'సమభావ చతురస్రం'గా మార్చడమేకవిచేసిన ప్రయోగం. అలాచేయడానికి నలుగురి వయస్సును సమం చేశాడు కవి. వృద్ధ,ప్రౌఢ బాల్యావస్థలలో ఉన్న జ్ఞానం, రాజ్యం, కళల వయస్సును ముప్పైసంవత్సరాలకు సమం చేయడం. యిందులో జరిగిన నాటకం. కవి వయస్సు ఎప్పుడు ముప్పైసంవత్సరాలే. అంటే మనిషి "చిరంజీవి" అవడాన్ని కవి అన్యాపదేశంగా సూచించాడన్నమాట. ఈనాటికజరిగినకాలం 1999 డిసెంబరు 31. ఆనాడు మనిషి చంద్రసీమనుంచిఅమృతంతెచ్చాడు. దానిని ప్రజలందరికి పంచాడు. వారు (కాగారు. చిరంజీవులైనారు. అమృత పానానికి, వెనుక ముందుకూడా కవి వయస్సు, ముప్పైసంవత్సరాలే. అంటే కవి "కాలంజయుడు" అని శ్రీశ్రీ భావం అయివుంటుంది. ఇందులో కవిపేరు సిరిసిరి, అంటే శ్రీశ్రీయేనేమో !

ఇలాగే కాలజిజ్ఞాసా ప్రధానమైన ఇతివృత్తంతో నడిచిన నాటిక "అనంతర యాత్ర" భావ ప్రధానమైన కల్పన ఇది. రైలు ప్రయాణం చేస్తున్న సరళ, కాంతం అనేస్త్రీలు తమగడియారాలు ఆరుగంటలకు ఆగిపోయినటు గుర్తిస్తారు. తోటి ప్రయాణికుడు రంగారావు వాచీకూడ ఆరు గంటలకే ఆగిపోయినదీ లేనిదీ తెలుసుకోవాలని అతనిని ప్రశ్నిస్తారు. జవాబు చెప్పేలోగానే రైలు ప్రమాదం జరుగుతుంది. అతను మరణిస్తాడు. అయితే అతనిలో కాలజిజ్ఞాస మాత్రం పోలేదు. అతని ఆత్మ తిరుగుతుంటుంది. అతని ప్రశ్నకు సంతృప్తికరమైన సమాధానం దొరకలేదు. అందరికాలం ఒక్క బిందువు వద్దనే స్తంభించి పోతుందా! అనే ప్రశ్నకు సమాధానం దొరకడం సాధ్యం కాదని

ఈ నాటిక ద్వారా కవి స్పష్టంచేస్తాడు. ఐన్‌స్టెయిన్ సిద్ధాంతపు కాలపరిణామం గురించి కవి ఈ నాటికలో ప్రతీకంగా చెపుతాడు.

ఇలాగే బలి, గవేషణ, విదూషకుడి ఆత్మహత్య, గ్రామఫోన్ రికార్డుల తిరుగుబాటు, గుమస్తాకల, మరో ప్రపంచం మొదలైన రూపకాలలో కవి మనో లోకంలో దర్శించిన జగత్తును, వాస్తవ ప్రపంచానికి మధ్య వారధి నిర్మించే యత్నం జరుగుతుంది.

"సుప్తాస్థికలు" నాటిక గాంధిజీ మరణానికి ప్రపంచ ప్రజలు పడిన నిర్వేదానికి ప్రతీక. ఇందులో సంధ్య, అంధకారం నక్షత్రం- యివి మృత్యువుకి నిరాశకూ, ప్రేమకీసంకేతాలు. ఈ నాటికలలో ఎక్కడా గాంధీజీ ప్రస్తావన రాదు. కాని అంతా గాంధీజీ మృతికి నిర్వేదం.

ఈ నాటికలను విశ్లేషించుకొన్నట్లయితే ప్రతీక లేక సంకేత రూపకాల నిర్వచనం సులభం అవుతుంది.

ఒక వాస్తవ సంఘటనను అన్యాపదేశంగా చెప్పడం, రేపటిప్రపంచపు కల్పనను కవితామయంగా చెప్పడం, ఒక అనుభవాన్ని ఎక్స్‌రే తీసి చెప్పడం, కేవల భావనతో కథను నడపడం- ఇదంతా ప్రతీక రూపకం రచనకు నాలుగు మాటల నిర్వచనం.

ఇటీవల కాలంలో శ్రీ ఆకొండి వెంకటరత్నం "ప్రహేళిక" అనే ప్రతీక రూపకం వ్రాశారు. సామాన్య మానవుని నిరుపమానమైన చైతన్య శక్తిని ఆయన ఈ రూపకంలో 'ప్రతీక' గా ఆవిష్కరిస్తారు. అలాగే శ్రీ పన్నాల సుబ్రహ్మణ్య భట్టు "అనుభవదీపం" వ్రాశారు. నిత్యజీవితంలోని సంఘటనల వెనుక మనస్సులోని భావాలు యిక్కడ ప్రతీకలు. ఈ వ్యాసకర్త "ప్రభవ" అస్థిగీతం –ప్రతీకరూపకాలు వ్రాశారు.

కనిపించే ప్రతి వస్తువు ఒక భావానికి ప్రతీక, మనస్సును తొలిచే ప్రతిభావం ఒక వస్తువుకు సంకేతం. రచయిత భావనా పటిమ, పరిశీలనాగరిమను బట్టి "ప్రతీక+వాని పారదర్శకశక్తి" మారుతుంటుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే నిత్యజీవితంలో తారసపడే ప్రతి సంఘటన ఏదో ఒక భావనకు ప్రతీక. కనుక "ప్రతీకరూపకం", అంటే నిన్ను నువ్వు ఎక్స్‌రే తీసుకొని చూపడం. వాస్తవజగత్తులోని అదృశ్య తలాలను ఆవిష్కరించడం. అందుచేత "ప్రతీకరూపక ప్రక్రియ" కు నిర్దుష్టమైన కొలతలు లేవు. స్పష్టమైన రూపాలు లేవు. అస్పష్టంలో నుంచి స్పష్టం అయ్యే భావనల సంపుటి "ప్రతీకరూపకం" మనం మనరంగస్థలం అక్కడకు యింకా ఎదగాలి.

# అణువులు - నాలుగు

— విహారి

## ఒకటి - తలకాచుకో!

పెద్దదొర—
పొద్దుట్నుంచీ ఉపన్యాసమిచ్చాడు,
దోపిడీ విధానానికి తాను
బద్ధవ్యతిరేకినని.
రాత్రి—
బాలీసుమీద అయినా,
అరగుజ ఆరడుగుల అవతల
చేతులు కట్టుకుని
పాతిక మంది పాలేర్లు—
రింగ్ మాష్టర్ ముందు
వంగి వంగి నిలబడ్డ
సివంగులు !!!

## రెండు - మీనియల్స్!

పేకలదాకా-రౌండు మీద రౌండు
ఆ పైన చికెన్ బిర్యానీ,
బిల్లు నేనిస్తా నంటే నేనిస్తానని
పీక్కున్నారు.
ఖాళీసీసాల సంపుటం కదరక
పళ్ళు కొరుక్కున్నారు.
పిడికిళ్ళు బిగించుకున్నారు.
'బిహేవ్ యువర్ సెల్ఫ్' చెప్పుకుంటూ
బిట్టర్ గా ఉమ్మేసుకున్నారు!
కల్చర్ గురించి
ఒకరు రోజూ 'కాలమ్' రాస్తారు.
ఒకరు ఈజీగా 'పాఠమ్' చెప్తారు !!!

## మూడు - గ్రేటర్ బాంబే!

మెరైన్ డ్రైవ్
దారావీ—
కాంటాక్రిడ్
కామాటిపురా—
మహాలక్ష్మి
జుహూబీచీ—
గాడెక్రింది పందికొక్కుల వ్యవస్థ,
చెప్పక్రింది తేళ్ళ అవస్థ !!!

## నాలుగు - విద్యాభ్యాసం!

A రాని దానికి
సున్నా ముసుగేస్తే చాలు
అవిరళంగా వారం వారం
నోరూరించుకో గలదు;
కవసాహిత్యపు
సారాపోస్తే చాలు
అవురావురని క్షణ క్షణం
దోసిలి పట్టగలదు; అవును-
చంద్రుణ్ణే మానభంగం చేసిన మనిషి
అసలు జబ్బేమిటంటే—
ఇప్పుడు-వీడికి
'రటీనా డిటాచ్‌డ్' !!!

* * *

# పైశాచీ ప్రాకృతంలో బృహత్కథ-ప్రాకృతంలో గాథాసప్తశతి

ముక్కామల నాగభూషణం

కళ కళకోరకా! లేక ప్రజల కోరకా? అను వాదోపవాదనలు ఈ నాటివి కావు. శతాబ్దాల తరబడిగా సాగుతున్న వే.

ప్రజలకు బాగా తెలియడంకోరకు జాతక కథలను బౌద్ధులు పాలీభాషలో వ్రాశారు. జైనగాథలను అర్ధమాగధిలో వ్రాశారు. గుణాఢ్యుడు బృహత్కథను పైశాచిలో వ్రాశాడు. పురాణాలను సంస్కృతంలో వ్రాయడం వల్ల అవి పండితుల వరకే పరిమితమైపోయాయి.

"పైశాచి అంటే పిశాచాలుమాట్లాడుకునే భాషకదా! అది గుణాఢ్యునికెలా తెలిసింది. ఆయనొక పెద్ద భూత వైద్యుడా!" అని ఒకాయన నన్ను ప్రశ్నించాడు.

"పిశాచాలూ లేవు, అవి మాట్లాడేభాషా లేదు. భయంకొద్దీ మనం వాటిని సృష్టించుకున్నాం." అని నేను చెప్తే ఆయన తెల్లబోయాడు.

శౌరసేని, మహారాష్ట్రి ప్రాకృతముల అపభ్రంశమే, అనగా వ్యవహార రూపమే పైశాచి ప్రాకృతమనిపండితుల అభిప్రాయం. పైశాచీ ప్రాకృతం వింధ్య పర్వతాలకు తూర్పున, దక్షిణాన గల అనేక ప్రాంతాలలో ప్రజల భాషగా వుండేదని, దానితో అనేక విధాలుగా పాలీభాష ఏకీభవిస్తోందని "స్టెన్‌కోన్" అనే పేరుగల పాశ్చాత్య పండితుడు నిరూపించాడు. సామాన్యప్రజలను దృష్టిలో నుంచుకొని గుణాఢ్యుడు, ద్రావిడ భాషల్లోని తద్భవములకుమూలమైన పైశాచి ప్రాకృతంలో బృహత్కథను రచించాడని ఈ నాడు అనేకులు విశ్వసిస్తున్నారు- అయినా, కథాసరిత్సాగరములోనున్న ఒక కథ చిలవలు పలవలుగా వ్యాపించి అసలు విషయాన్ని మరుగుపరుస్తోంది. ఆ కథ ఇది....

"సాతవాహన రాజు పండితుడు కాడు. కాని, అతని భార్యల్లో ఒకామె మంచి పండితురాలు. ఒకనాడు వారిరువురూ జలక్రీడలాడుతున్న సమయంలో ఆమె రాజుగారినిసంస్కృతభాషలో పరిహసించగా, రాజుగారు సిగ్గుపడిపోయాడట. ఎంత త్వరగా సాధ్యమైతే అంతత్వరగాసంస్కృతం నేర్చుకోవాలని రాజుగారు శర్వవర్మ అనే సంస్కృత పండితుని పిలిపించాడట. ఆరునెలల్లోనే రాజుగారిని సంస్కృత భాషాకోవిదునిగా చేస్తానని శర్వవర్మ చెప్పినప్పుడు, అది సాధ్యంగాని పని అని గుణాఢ్యుడు వాదించడమే గాక, ఆ పని సాధ్యమైతే తాను సంస్కృతంలో గాని, ప్రాకృతంలో గాని రచనలు చేయనని శపథం కూడా చేశాడట.

ఆరునెలల్లోనే రాజుగారు సంస్కృత భాషలో మంచి పండితుడయ్యాడట. కాబట్టి శపథం ప్రకారం గుణాఢ్యుడు బృహత్కథను సంస్కృత ప్రాకృత భాషల్లో రాయకుండా పైశాచిలో వ్రాశాడట. దాన్ని రాజుగారు

తిరస్కరించిన సందున గుణాఢ్యుడు వింధ్య పర్వతాల్లోకి పోయి అడవి జంతువులకు పక్షులకు తన బృహత్కథను చదివి వినిపిస్తూ, వినిపించిన భాగాలను మంటలో వేసి తగుల బెడుతుండగా, ఆ వార్త రాజుగారికి చేరిందట. వెంటనే రాజుగారు వింధ్యపర్వతాలకు వెళ్ళి బృహత్కథను వింటున్న జంతువులను పక్షులను చూచి పశ్చాత్తాపపడి, గుణాఢ్యుని బ్రతిమాలి, తగుల బెట్టగా మిగిలిన కథను తీసుకొని, దానికి తానే పీఠిక వ్రాశాడట. అయినా, అప్పటికే మూడువంతుల కథ తగలబడిపోయి ఒకవంతు కథ మాత్రమే మిగిలిందట" ఇదీ కథ-ఇది కల్పిత కథ మాత్రమేనని పలువురు విమర్శకులిదివరకే చెప్పారు-

ఏది ఏమైనప్పటికీ పైశాచీ ప్రాకృతంలో గుణాఢ్యుడు రచించిన బృహత్కథ ఏమై పోయిందో తెలియదు కాని, బృహత్కథ మాత్రం సజీవంగానే వుంది. దానిననుసరించి సంస్కృతంలో అనేక గ్రంథాలు వెలువడినాయి. భట్ట, బాణాది మహాకవులు బృహత్కథను ప్రశంసించారు. దీనిలో గల సత్యరాజు కథను కాళిదాసుపేర్కొన్నాడు. పురాణ ఇతిహాసాదుల్లోని కథలకు గాక, తక్కిన కథల కన్నింటికీ తల్లి బృహత్కథ యని దనుంజయాది పండితులు ప్రశంసించారు. బృహత్కథ ననుసరించి భాసుడు ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్న వాసవదత్త నాటకాలను వ్రాశాడు ఈ కథను ఆధారంగా చేసుకొని అనేక సంస్కృత గ్రంథాలు వెలువడినాయి. వాటిలో సోమదేవ సూరిగారి కథాసరిత్సాగరము ప్రధానమైనది. సంస్కృత వాఙ్మయంలో రామాయణ, మహాభారతములకెంత గౌరవమున్నదో, ప్రాకృత వాఙ్మయంలో బృహత్కథకంత గౌరవముంది.

బృహత్కథ తరువాత వెలువడిన గాథా సప్తశతికి కూడా ప్రాకృత వాఙ్మయంలో మహోన్నత స్థానముంది. సంస్కృత భాషలోని ఆర్యాసప్తశతి, అమరుకము వంటి లలిత శృంగార రచనలకు గాథా సప్తశతియే మూలం. దీనిలో ఏడువందల శృంగార గాథలున్నాయి. గాథ అనగా ప్రాకృతంలో రచించిన పద్యం. ఈ పద్యాలు వేటికవే స్వతంత్రములు. ఒక దానితో మరొక దానికి సంబంధముండదు. వీటిని రచించిన వారిలో మాధవి, రేవ, అనుపలబ్ధి, అణులక్ష్మి మొదలైన కవయిత్రులున్నారు. అత్త, అమ్మ, అందము, పాడి, పొట్ట వంటి అచ్చ తెలుగు మాటలు అనేకం గాథా సప్తశతిలో వున్నాయి.

కాబట్టి, ప్రజలు మాట్లాడుకునే భాషలో ప్రజాజీవితాన్ని ప్రతిబింబిస్తూ వెలువడిన గాథలు, కథలు పండితుల గ్రంథాలకు మూలమయ్యాయని తేలిపోతోంది కదా! * * *



# బాలసాహిత్యము-కథలు, నాటికలు

—సోమంచి రామం

సహితము అంటే హితముతో కూడినదని- దానిభావమే సాహిత్యమని పెద్దలు చెప్తారు. హితముతో కూడినదని చెప్పకంటే- హితమునే చెప్పేది, లేక హితమునే చేకూర్చేదే సాహిత్యం అంటే బాగుంటుందేమో! అంటే ఏ సాహితీ ప్రక్రియద్వారా మానవులలో మంచిని పెంచటం జరుగుతుందో, అదే సాహిత్యం అని పిలవబడటానికి అర్హత కలిగి ఉంటుందని నా భావన. ఈ సాహిత్యం ప్రక్రియల్లో వెలువడటం మనకు తెలిసిన విషయమే గేయసాహిత్యం కథాసాహిత్యం. నవలాసాహిత్యం, నాటక సాహిత్యం యిత్యాదులు.

[illegible]

బాలల అంటే చిన్నపిల్లల స్థాయికిసరిపడి వారికుపకరించే సాహిత్యాన్ని బాలసాహిత్యం అని పిలవవచ్చును. సాధారణంగా 8 నుండి 14 సంవత్సరముల వయస్సు వరకు గల పిల్లలను బాలలని పిలుస్తాము ఈ వయస్సులో వారికి అర్థమయ్యే రీతిలో ఆసక్తి కలిగించే పద్ధతిలో, అవసరమయ్యే విషయాల్ని పైన తెల్పిన వివిధ ప్రక్రియల్లో అందచేయటమే బాలసాహిత్యం యొక్క పరమార్గం అసలు రేపటి పౌరులు గాబట్టి, బాలలకు స్నేహశీల్యం, శాంతి సాత్వికత, ధీరత్వం, త్యాగబుద్ధి, మొదలైన ఆదర్శ లక్షణాలను అలవర్చే ఆలోచనలు, అభిరుచులు, ఆశలు వారితో కలిగించాలి. అప్పుడే భావి భారత పౌరులు సర్వతోముఖాభివృద్ధి గాంచిన విశిష్ట వ్యక్తులుగా తయారవుతారు. ఇందుకోసమే బాలలకు ప్రత్యేక సాహిత్యం ఉండి తీరాలి. అసలు బాలసాహిత్యానికి పుట్టినిల్లు గేయ సాహిత్యమే. ఈ విషయాన్ని గ్రహించి మొట్టమొదటగా బాలసాహిత్యానికి నాంది వాచకము పలికిన మహానుభావులు, శ్రీ వీరేశలింగం, గురజాడ, శ్రీ వీరేశలింగం గారు పిల్లలకోసం జానపద సాహిత్యాన్ని విజ్ఞానశాస్త్ర విషయాల్ని సమన్వయపరచి వాచకాలను తయారుచేశారు, ఆయన పర శిష్యోత్తమ శ్రీ చింతా దీక్షితులుగారు లీలా వాచకాలను వ్రాశారు. ఇలా వాచకాలలో ప్రారంభమయిన బాలసాహిత్యాన్ని ఆ తరువాత ఎందరెందరో మహానుభావులు- వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, వేటూరి శివరామశాస్త్రిగారు, గిడుగు సీతాపతిగారు, న్యాయపతి దంపతులు, ఇల్లిందల సరస్వతీ దేవిగారు, కవిరావు, బి. వి. నరసింహారావు మనలాషి, వేజెండ్ల సాంబశివరావు, మద్దిపట్ల వెంకటరావు, ఈ రచయిత-యిలా యెందరెందరో యెన్నో విధాలుగా ఈ బాల సాహిత్యాల్లో ఎనలేని కృషి సల్పి, దాన్ని పెంచి పోషించారు, పోషిస్తున్నారు.

వీరేశలింగం గారితో ప్రారంభమయిన యీ బాల సాహిత్యం దిన దిన ప్రవర్థమానమై యీనాడు బహుధా విస్తరించి యున్నది. ఆనాడు కేవలం వాచకాలలోనే

పరిమితమైన బాలసాహిత్యం, ఈనాడు పాఠ్య గ్రంథాల పరిధిని దాటి, స్వతంత్ర గ్రంథాల రూపంలో వెలువడే స్థితిని చేరుకుంది. ఇందుకు దోహదపడుతున్నవి పత్రికలు. బాలలకోసం పత్రికలు అనగానే ముందుగా మనందరి మనస్సులోను కదిలేది 'బాల' పత్రిక. 1945లో న్యాయపతి రాఘవరావు, కామేశ్వరీల ఆధ్వర్యములో ప్రారంభించబడిన "బాల" పత్రిక చాలకాలం చాలా గొప్పగా నిర్వహించబడింది. ఆ తర్వాత 1946లో నాగిరెడ్డిగారి "చందమామ", తర్వాత "బాలబంధు", "పాపాయి", "బుజ్జాయి", "బాబు", "బాలమిత్ర", "బొమ్మరిల్లు", "బాలానందం". ఇలా యీ మధ్య కాలంలో పిల్లల పత్రికలెన్నో వచ్చాయి. ఇవి గాక ప్రముఖ దిన, వార పత్రికలలో బాలలకోసం కొన్ని పేజీలు కేటాయించబడుతున్నాయి. "విశాలాంధ్ర" దిన పత్రికలో డా. కే. నార్ల చిరంజీవి నిర్వహించిన "చిన్నారిలోకం" శీర్షికే ఇందుకు ఉదాహరణ. ఈ విధముగా యీనాడు బాలలకోసం, బాల సాహిత్యం కోసం అవకాశాలు యెక్కువ ఏర్పబడ్డాయి.

ప్రస్తుత విషయం బాల సాహిత్యంలో కథలు, నాటికల వరకే పరిమితమైయుంది. అందుకని ముందుగా కథల గురించి పరిశీలిద్దాం. బాలలకు ఎలాంటి కథలు కావాలి? అంటే బాలలు ఎలాంటి కథలు చదువుతారు? ఎలాంటి కథలు చదవాలి? ఎలాంటి కథలు చదివించాలి? ఎలాంటి కథలు చదువుతున్నారు? ఇన్ని ప్రశ్నలు వేసుకోవాలి. ఈ ప్రశ్నలన్నిటికి సమాధానం చెప్పకముందు ముందుగా బాలసాహిత్యం యొక్క పరమార్థాన్ని దృష్టియందు ఉంచుకోవాలి. బాలల వయస్సు గురించి ముందే చెప్పుకున్నాము. ఆ వయస్సులో సహజంగా మనసు కొత్తదనంకోసం ఉవ్విళ్ళూరుతూ, ఉరకలేస్తుంటుంది. తనకు తెలిసిన విషయం చెప్పబోతే, ఆ పసివాడు యిట్టే చప్పబడిపోతాడు. అందుకనే చెప్పే కథ ఏదైనా చెప్పే విధానం ఆసక్తికరంగా ఉండాలి. అందుకని కథలలో ఉండే రకాల గురించి చూద్దాం.

ముందుగా జానపద కథలు. పూర్వం ఈ రాతకోతలు, అచ్చు సౌకర్యాలు అంతగా అభివృద్ధి కాకపోవటంతో, కథల్ని ఒకరికొకరు చెప్పుకునేవారు. అలా చెప్పుకునే కథలే జానపద కథలు. పేదరాశి పెద్దమ్మ కథలు, భేతాళ కథలు, భట్టి విక్రమార్క కథలు మొదలైనవి. ఈ కథలలో ముఖ్యంగా రాజకుమారులు, రాజకుమార్తెలు, మంత్రి కుమారులు, మంత్రికుమార్తెలు, రాక్షసులు, మంత్రగత్తెలు మొదలైనవారుంటారు. రాజకుమార్తెను రక్షించటంకోసమో, పెళ్ళి ఆడ్డం కోసమో; రాజకుమారుడు చేసే సాహసకార్యాలు, మంత్రికుమారుని సహకారాలు, రాక్షసులు అడుగడుగునా ఆపదలు కల్పించటం, వాటిని శక్తియుక్తులతో అధిగమించటం-ఆఖరకు అనుకున్న కార్యం సాధించటం జరుగుతుంది. ఇలాంటి కథలను పదేపదే చదవడంవల్ల, వారియొక్క కార్య సాధనా దీక్ష పెరిగి, లక్ష్య సాధనకు కృషి చేసే మనస్తత్వం పిల్లలలో ఏర్పడుతుంది. తాను కూడా ఒక రాజకుమారుడిలా వీరోచిత కార్యాలు చేసి ఆ దుష్ట రక్కసులను సంహరించాలనే ఉత్సాహం ఉప్పొంగుతుంది ఆ పసివాని మనస్సులో. యీ విషయాన్ని యిటీవలే పలుదేశాల శాస్త్రజ్ఞులు సమర్థించారు.

శ్రీ కొతవరపు కృష్ణమూర్తిగారి బాల కాశీ మజిలీ కథలు, లక్ష్మీ కాంతమోహన్ గారి పేదరాశి పెద్దమ్మ కథలు, నండూరి విఠల్ గారి జానపదకథలు, మొదలైనవెన్నో ఈ కోవకు చెందుతాయి. ఇలాంటి కథలు పిల్లల్లో ధైర్యసాహసాలను, శక్తియుక్తులను, ఆలోచనాధోరణిని కలిగించడానికి దోహద పడతాయి.

భావిభారత పౌరులు సత్పౌరులుగా తయారు కావాలంటే, పసితనంలోనే వారి మనసుల్లో కొన్ని మంచిగుణాలు,ఆదర్శాలు ఆశయాలు, నాటుకొనేటట్లు చేయటం అవసరం. ఈ లక్ష్యసాధనకోసమే నీతి కథలు ఎంతైనా అవసరం. నీతిని ఉన్నదున్నట్టు చెప్తే ఎవరికీ తలకెక్కదు, ఆ నీతికి కొంచెం కథ జోడించి చెప్తే పిల్లల మనసుకు హత్తుకొంటుంది. అసలు యీ మహత్తరసత్యాన్ని ఎన్నో వందల క్రిందటే గుర్తించే, విష్ణుశర్మ, పంచతంత్రం ఉదయించింది. నోరులేని,ఆటే మాటలు లేని, మాటలు రాని జంతువులను పక్షులను ఆధారం చేసికొని. నోరున్న,మాటలొచ్చిన మానవులకు మంచిబుద్ధులు గరపడం కోసం ఈ కథలు సృష్టించబడ్డాయి. వేలూరి శివరామశాస్త్రిగారు ఒక్కొక్క కథకు ఒక్కొక్క నీతిని అందిస్తూ 122 చిన్న చిన్న బాల విజ్ఞాన కథలనురచించారు. పంచతంత్ర కథలను తేలిక భాషలో పిల్లలకర్థమయ్యే రీతిలో శ్రీ ఎస్.వి.ఎస్. శర్మగారు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రిగారు రాశారు. ఇవి గాక శ్రీ నండూరి విఠల్ గారి నీతిసుధ, శ్రీ ఎస్.వి.ఎస్. శర్మగారి హితోపదేశ కథలు, విద్వాన్ దేవరకొండవారి జోపస్ కథలు, వీరేశలింగంగారి ఈసప్ కథలు మొదలైనవన్నీ పిల్లలకు నీతి బోధనా లక్ష్యంతో రచించబడినవే.

దినదినానికీ క్షణక్షణానికీ పెరిగిపోతున్న విజ్ఞాన శాస్త్రాన్ని, శాస్త్రంగానే బోధిస్తే పిల్లలకు బాధ కలగడమే కాని, బోధన జరగదు. అలాగని,పిల్లలంతా పెద్దలయ్యాకే విజ్ఞానాన్ని బోధిద్దాములే అని దాటేయడానికి వీలులేదు పిల్లలుగా ఉండగానే వారిలో విజ్ఞాన శాస్త్రంపట్ల అభిలాష, అభిరుచి కలిగేలా, ఆసక్తి దాయకంగా శాస్త్ర విషయాల్ని కథల రూపంలో చెప్పాలి. ఏ పిల్లవాడినైనా పిలిచి నువ్వు డాక్టరువు అవుతావా అంటే 'ఓ' అంటాడు. అయితే అందుకేం చేయాలో తెలుసా అంటూ టూకీగా వైద్యశాస్త్రంలో కొన్ని కొన్ని చిట్కాలు కథలుగా చెప్తే ఆ పిల్లవాడి మనసుకు హత్తుకుపోయి, ఆ ప్రకారమే ఆచరణలో పెట్టాలని చూస్తాడు. అలాగే నువ్వూ ఒక "శాస్త్రజ్ఞుడివే" అంటూ ఓ శీర్షిక పెట్టి అందులో చిన్న చిన్న పిల్లలు తెలియకుండా చేసే కొన్ని పనుల్లోంచి శాస్త్ర విజ్ఞాన విషయాలను బోధించవచ్చును. డ్రింకు బాటిల్లోని డ్రింకు గొట్టం ద్వారా నోట్లోకి ఎలా వస్తోంది! లోపలికి పీలిస్తే వస్తోందని వాడికి తెలుసు. అయితే అలా రావడానికి సహాయపడే గాలి పీడన శక్తి గురించి కథలా చెప్పాలి. అప్పుడు 'ఓస్' విజ్ఞానశాస్త్రమంటే యింతేనా — అంటూ యింకా ఆనందంతో ముందు కెడతాడు. ఇలాంటి భావాలతోనే పలువురు రచయితలు విజ్ఞాన శాస్త్ర విషయాల్ని కథల రూపంలో పిల్లలకందించారు. అలాంటి వారిలో ప్రముఖులు, శ్రీ పాద గోపాలకృష్ణమూర్తి గారు, రావూరి భరద్వాజగారు, వేమరాజు భానుమూర్తి, వసంతరావు వెంకటరావు, అవసరాల రామకృష్ణారావు, విశాలాక్షి గారలు కొంతమంది మాత్రమే. భూమి కథ

కథువుల్లో గారడి, కెమిస్ట్రీ కథలు, సిరు కథలు. విప్లవకథలు, ఉప్పుకథలు, రేడియో కథలు యిలా....ఎన్నెన్నో విజ్ఞాన శాస్త్ర విషయాల్ని కథల రూపంలో చెప్పే పుస్తకాలు వెలువడ్డాయి.

ఇవికాక కేవలం పిల్లలకు కొంత కాల క్షేమం కోసము కథలను కల్పించి, కల్పన కథలుగా కొన్ని పుస్తకములు వెలువడ్డాయి.

ఒట్టి కథల పుస్తకాలను చదవడం అంటే కొంతమందికి విసుగు పుట్టుంది. అందుకని కథలోని విషయమును బొమ్మలతో జోడించి ప్రచురిస్తే వాళ్ళకు ఆనందం కలుగుతుంది. అందుకనే సోవియట్ రష్యా వారు పిల్లలకోసం ఒక పేజి కథనే అయిదారు ఉజేల బొమ్మల పుస్తకాలలా ప్రచురించి పిల్లలకు ఉత్సాహాన్ని కలిగిస్తున్నారు. అంతే కాదు ఆ బొమ్మలు, ఆ కాగితం, ఆ ముద్రణ ఎంతో ఆకర్షణీయంగా ఉండటమే కాకుండా పుస్తకము వెల కూడా చాలా తక్కువగా ఉంటుంది. అంతగా కాకపోయినా కొంతగానైన మన ప్రచురణ కర్తలు కొందరు మన పురాణ గాథలను, రామాయణ, భారత, భాగవతాల్ని బొమ్మలతో ప్రచురించారు. బాలసరస్వతీ బుక్ డిపో కర్నూలు, కొండ శంకరయ్య వగైరాలు. ఇవి గాక యిప్పుడు ప్రతి దిన, వార పత్రికలలో యిలాంటి చిత్రకథలను ప్రచురిస్తున్నారు.

వచన రూపంలో ఉండే పెద్ద పెద్ద కథల కన్న చిన్న చిన్న మాటలతో గేయ రూపంలో కథలను రాస్తే పిల్లలకు చదువుకొనడానికి చాలా సంతోషముగా ఉంటుంది అలాంటివే గేయకథలు. ఈ గేయ కథలకు ప్రాస, యమకం ప్రాణం లాంటివి. అవి ఎంత చక్కగా కుదిరితే అంత ఆనందం కలుగుతుంది పిల్లలకు. ఈ రంగాలలో రచనలు సాగించిన వారిలో కొందరు శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి, వీరావు. సమతారావు, శ్రీ సందూరి రామమోహన రావు, కొండపల్లి కోటేశ్వరమ్మ, బి. వి. నరసింహారావు, వడిద కామేశ్వరరావు. శ్రీ అలపర్తి వెంకట సుబ్బారావు. వీరేగాక యింకను చాలా మంది ఉన్నారు. గుజ్జన గూళ్ళు, చిరుమువ్వలు, గేయకథలు, అమ్మ చెప్పిన (గేయ) కథలు మొదలైనవి వారి రచనలు.

ఈ విధంగా బాల సాహిత్యం లోని కథలను మనం వర్గీకరించి కాకాక ఇలాంటి వివిధ రకాల కథలకు ఒకే పుస్తకరూపంలో ప్రచురిస్తే బాగుంటుం దన్న తలంపుతో, ఈ నాటి బాలల పత్రికలన్నింటిలో యీ శీర్షికలన్ని చోటు చేసుకుంటున్నాయి. బాలజ్యోతి, బాల భారతి, బొమ్మరిల్లు, బాలచంద్రిక యిలా యీనాడు యెన్నెన్నో బాలల పత్రికలు ఈ కథా సాహిత్యానికి తోడ్పడుతున్నాయి.

కథలు చదువుతుంటుంటే ఒక్కరే ఆనందిస్తారు. ఆ కథలకు సంభాషణలను జోడించి నాటిక రూపంలో రాసి ప్రదర్శిస్తుంటే ఎందరో ఆనందించ వచ్చును, అందుకోసం పిల్లల నాటికలను కూడ తయారు చేయాలనే తలంపు కలగడంతో న్యాపతి రాఘవరావుగారు రేడియోద్వారా పిల్లల నాటికలను కొన్ని ప్రసారం చేశారు. నాటికలనగానే మళ్ళీ అందులో రకాల గురించి చెప్పుకోక తప్పదు. శ్రవ్యనాటికలు దృశ్య నాటికలు, గేయనాటికలు, అందు

లోనూ పిల్లల నాటికలన గానే మనం ముఖ్యంగా రెండు విషయాలను దృష్టియందుంచుకోవాలి. పిల్లల నాటికలు అంటే కేవలం పిల్లలు ప్రదర్శించడానికి వీలుగా ఉండే నాటికలా! లేక పిల్లలకు సంబంధించిన విషయాలనే తీసికొని రాసిన నాటికలా ! మొదటిది కథా వస్తువులో నిమిత్తము లేకుండా, నాటికల్లోని వేషభాషలు పిల్లలకు అందుబాటులో ఉంటాయి. ఉదాహరణకు కరుణ శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు రచించిన "బంగారు పద్మం" నాటికల సంపుటిలో బంగారుపద్మం, బొమ్మపాత్రికలు యజ్ఞతురగం వగైరాలున్నాయి. అవన్నీ పురాణగాథలు. బొమ్మల అలంకరణకోసం రంగురంగుల గుడ్డలను ఉత్తర యుద్ధ భూమికి వెడుతున్న ఉత్తరకుమారుని కోరటం, ఉత్తర కుమారుని ప్రగల్భం, అర్జునుని ప్రతాపం, మొదలైనవన్ని అందులో ప్రదర్శితమౌతాయి. యజ్ఞతురగం కుశలవులు యాగాశ్వాన్ని బంధించడం మొదలైన విషయాలకు సంబంధించినది. ఇలాగే ఎ. రమేష్ వ్రాసిన పిల్లల నాటికల్లో లవకుశ, పన్నా దేశద్రోహం, మొదలైనవి ఉన్నాయి. కావ్యశ్రీ రచించిన పిల్లల నాటికల్లో బాల లీలలు శ్రీకృష్ణుని చిలిపి చేష్టలు, బాల విజయం—భక్తప్రహ్లాద చరిత్ర ఉన్నాయి. అలాగే ఇల్లిందల సరస్వతీదేవిగారి బాల వీరులు నాటికలు. ఇవన్నీ కూడా చిన్నపిల్లలు ప్రదర్శిస్తుంటే బాగానే ఉంటాయి. భాష, వేషం పిల్లల కందుబాటులోనే ఉంటుంది. కాని సమస్యగాని, కథావస్తువుగాని పిల్లలకు సంబంధించినదికాదు. అందుకోసం పిల్లల సమస్యలనే కథా వస్తువులుగా తీసుకుని ప్రదర్శన యోగ్యమైన నాటికలు వ్రాసిన వారు కూడా లేకపోలేదు. స్వర్గీయ నార్ల చిరంజీవి ప్రోత్సాహంతో ఈ రచయిత వ్రాసిన "పరీక్ష" నాటికలసంపుటి, 'నాగలు' నాటికల సంపుటిలో యితి వృత్తాలన్నీ పిల్లలకు సంబంధించినవే. అలాగే అన్నపర్తి వ్రాసిన ప్రోగ్రెస్ కార్డు, సన్యాసంవగైరాలు. న్యాయపతి రాఘవరావు గారు, ఏడిద కామేశ్వరావుగారు. మరెందరో కూడా ఈ రకమైన నాటికలను రచించారు.

అలాగే విజ్ఞాన శాస్త్ర విషయాల్ని తీసుకొని, శ్రవ్యనాటికలుగా రేడియోకోసం కొందరు రాశారు. రమాదేవిగారి "మీరు నేను జట్టు" అన్న సంపుటిలో 'వర్షం—వడగండ్లు' 'ఉరుము — మెరుపు' లాంటివి ఉన్నాయి. ఎస్. రఘురామచంద్రగారి 'భూమివింతలు-విశేషాలు' మసూనా గారి భూమి పుట్టుక, మానవ పరిణామమునుగూర్చి తెలిపే "ఒకే ప్రపంచం" ఈ కోవకు చెందినవే ఇక్కే ఎ.పి.బి.డి వారు బాలనాటికలు. గమ్మత్తు నాటికలు. హాస్యనాటికలు పిల్లల కోసం ప్రచురించారు.

ఇక రేడియో నాటికల్లో సిద్ధహస్తులు, న్యాయపతివారు, ఏడిదవారు. ఎన్నో నాటికలను రేడియో ద్వారా వినిపించారు. బాలాంత్రపు రజనీ కాంతారావుగారి 'మూల స్తంభాలు'—దృశ్య శ్రవ్య, నృత్య నాటిక విద్యార్థుల కుపకరించేది.

ఆలిండియా రేడియో ద్వారా నండూరి సుబ్బారావుగారు పిల్లల కోసం ఎన్నో శ్రవ్యనాటికలు ప్రసారం చేశారు.

ఏదిఏమైనా పిల్లలకు అవసరమయ్యే యితివృత్తాలతో పిల్లలే ప్రదర్శించుకునేందుకు వీలుగా వుండే దృశ్యనాటికల అవసరం యీనాడు యెంతైనా ఉంది. బాలల అకాడమీ వారు ఈ దశలో బాలసాహిత్య రచయితలకు ప్రోత్సాహమిచ్చి, పోటీలు ఏర్పాటు చేసి చక్కని నాటికలను రచింప చేసి ప్రచురించాలి.

ఈ చిన్న వ్యాసములో బాల సాహిత్య కృషికి తోడ్పడుతున్న రచయితలందరినీ పేర్కొనలేకపోయినందుకు క్షంతవ్యుడను. బాలసాహిత్య రచనలో భాగస్వాములుగా ఉండే రచయితలందరికీ నా కృతజ్ఞత. ఈ అవకాశం కల్పించిన కృష్ణాజిల్లా రచయితల మహాసభ నిర్వాహకులకు నా ధన్యవాదములు.

* *

# పిల్లల గేయాలు

డాక్టరు వెలగా వెంకటప్పయ్య

ప్రపంచంలో ఏ దేశ సాహిత్య చరిత్రను పరిశీలించినా ముందుగా గేయాలు కనిపిస్తాయి. ఆ తర్వాత పద్యాలు, కథలు మొదలైన ప్రక్రియలు వ్యాప్తిలోకి వస్తాయి. తెలుగు సాహితీ ప్రగతి దీనికి భిన్నమైనది కాదు. తెలుగు సాహిత్య తొలిదశలో గేయ కావ్యాలు అపారంగా వెలువడి సాహిత్య పరిపుష్టికి తోడ్పడ్డాయి.

వాల్మీకి రచన రామాయణం ఆది కావ్యం అంటారు. ఈ రచనకు బీజం విషాద గీతం అయితే తెలుగు బాల సాహిత్యానికి బీజం తల్లి హృదయం. బిడ్డ అమాయకత్వం ఆ "తల్లీబిడ్డల మధ్య ఆ నిముషంలో కాలాన్ని స్తంభింపజేసిన నిముషంలో. ప్రాణ కాంతిని ఒక బిందువుగా కేంద్రీకరించిన ఆ నిముషంలో వెలువడిందే బాలసాహిత్యానికి ఆలంబనం", అంటారు నార్ల చిరంజీవి. తల్లీ బిడ్డల బంగారు చెక్కిళ్ళు. పెదవులపై మెరిసే పసిడి వెన్నెల, నిండైన కనులు, మెండుగా గల అమాయకత్వం, అల్లరి, బాల గేయ వాఙ్మయానికి కథావస్తువు. ఆ తల్లీబిడ్డల మధ్య అవ్యక్తానందంలో వెల్లివిరిసిన విద్యుదావేశానికి భావచిత్రమే గేయ కవిత్వం. దాన్ని గురించి ఆధునిక సాహిత్యవేత్తలు ఈ విధంగా వివరించారు. "చల్లని, చక్కని మాటలు కలంలోంచి రావాలి, తియ్యని వెచ్చని భావాలు హృదయంలోంచి పాట స్ఫురించాలి" అదే బాలల కవిత్వం అనిపించుకుంటుంది అంటారు ఆంధ్రప్రదేశ్ ఆస్థాన కవి దాశరథిగారు. బాలల కోసం రచనలు చేసే కవికిగల పరిమితులను తెలియజేస్తూ, సి. నారాయణరెడ్డిగారు "కవి తాను ఎంత కొమ్ములు తిరిగినవాడైనా పిల్లల ఆలోచనలకు అనుభూతులకు అనుగుణంగా ఇమిడిపోవాలి. అంటే రాజమార్గంలో నడయాడే పట్టపు ఏనుగు — ముచ్చటగా ముక్కాలి పీటపై తిరగగలగాలి" అన్నారు. అంటే బాలలకోసం రచనా విధానం అంతటి క్లిష్టమైనదన్నమాట. అందుకనే చలంగారు మున్నెన్నడో—"పిల్లలకు పాటలు రాయడమంటే సామాన్యమైన పనిగాదు, మహా కవి కావడం సులభమైన పని దానికన్న" అన్నారు.

ఇదే భావాన్ని ఒక ఆంగ్ల విమర్శకుడు హుస్సేన్ వెలిబుచ్చారు. బాలలకు రచనలు చేయడం సులభం కాదు. సమాస భూయిష్ట రచనలకంటే సరళమైన రచనలు, తికమకలు కంటె సూటి రచనలు వారు కోరతారు. ఈ విషయాన్నే చలంగారు మరొక మూసలో చెప్పారు "బాల గేయాలలో ఎంతో లాలిత్యం హృదయ నైర్మల్యం, భావ పరిమళం నిండి వుంది. హృదయం లోంచి వచ్చే ప్రేమకీ అందానికీ రంగులు పూయక సూటిగా పాడిన పాటలకన్న వేరొక కవిత్వం

ఏముంది!" కనుక బాలల కవిత్వం ఎట్టి ముసుగు లేకుండా నిసర్గంగా నిర్మలంగా ఉండాలంటారు. ఈ మార్గంలో కొంత దూరం పయనించిన మిరియాల రామకృష్ణ బాలల కవిత్వంలో ఉండవలసిన ప్రమాణాలను గురించి చెబుతూ—కవిత్వం "జ్ఞాపకానికి నిలవడం, చదివినకొద్దీ నూతనానుభూతి కలిగించడం, అందరికీ అర్థంకావడం, ఛందం, ఆవేశం, ఆనందం, అభ్యుదయం," అన్నీ ఒక్కుమ్మడిగా ఒకగూడాలంటారు. చెప్పడానికేం అరిస్టాటిల్ అంతటివారు "ఈ జాతికి కావలసిన పాటలు మాత్రం నన్ను తయారు చేయనివ్వండి." అంటారు అరిస్టాటిల్ లని చెప్పడం తేలికే. కాని పిల్లల పాటలు రాయటం కష్టమైన పని" అందుకు అనువైన హృదయం, మనస్సు, ఉత్సాహం, ఆలోచన, పరిశీలన, లయ తాళ గతి, జ్ఞానం ఉండాలి." అంటారు బి. వి. ఈ దృష్టితో రాసినవి, నిలిచినవీ పిల్లల పద్యాలు, పాటలు కొన్ని లేకపోలేదు. వాటిని పరిశీలనలోకి తీసుకోవలసివుంది.

## పాపల గేయాలు

ఇవి 0-5 వయసులోపు పాపలకు సంబంధించినవి.వీటిని NHRSERY RWYMES అంటారు. వీటిలో అధిక భాగం తల్లులు పాడగా పిల్లలకు అర్థమైనా కాకపోయినా శ్రావ్యతను బట్టి ఆనందించేవి. రెండవది పిల్లలు పాడుకొనేవి. తల్లులు పాడేపాటలలో ఉగ్గు పాటలు, జోల పాటలు, లాలి పాటలు, ఊయల పాటలు, తొక్కు పల్కులు ముఖ్యమైనవి. ఉగ్గుపాటలనే పాల పాట లంటారు. ఉగ్గుపట్టడం తెలుగు తల్లికి అలవాటు. ఉగ్గు తెలుగువారి సంప్రదాయం ఈ గేయాలలో సాధారణంగా రెండే పాత్ర లుంటాయి. తల్లి-బిడ్డ. చిట్టి పొట్టిమాటలలో తల్లి బిడ్డను అలరిస్తుంది. ఇచట భాష భావానికి అతీతంగా ఉరకలు వేస్తుంది, తనకు తెలిసిందల్లా బిడ్డకు తెలియాలనే ఒక అవ్యక్తమైనతపనతో బిడ్డ చేయి ఊపుతూ

"చేయి ఊచమ్మ చేయి వూచు
సంతకు పోదాం చేయి వూచు
శనగలు తిందాం చేయి వూచు
చల్లగ తిందాం చేయి వూచు"

అంటుంది. ఇలా చేయడం తల్లికీ పిల్లకు సరదాకాక బిడ్డకు వ్యాయామం కూడ. డాక్టరు రామరాజుగారు తెలంగాణా ప్రాంతంలో ప్రచారంలో ఉండే ఒక పాట ప్రయోజనాన్ని యిలా వివరించారు డాక్టరు రామరాజుగారు. తల్లి శిశువును తనతొడలపై కూర్చుండబెట్టి ఒక చేయి బిడ్డ వీపు పైన మరొక చేయి రొమ్ముపై వుంచి పాట పాడుచు ముందు వెనుకల కూపుచు తాను కూడ యెడయల కూగును. శిశువు ఊ ఊ అనుచు వెనుక ముందుల కూగును. దీని వలన శిశువు శరీరమున కంతటికీ కావలసినంత పరిశ్రమ కలుగును....ఊపుతో శరీర మంతట రక్తప్రసారం జరుగునటులే ఈ పాటయందలి "గంగెద్దా"యను అంత్య ప్రాసలు లయను రక్తము వెంట శరీర మంతటను ప్రాకించును. బిడ్డ కొంత ఎదిగాక గోరుముద్దలు, గోలుసు ముద్దలు తినిపిస్తూ చందమామ ముచ్చట్లు చెబుతూ—

"చందమామ రావె జాబిల్లి రావె!
కొండెక్కి రావె! గోగుపూలు తేవె!
ఒలవని పండు ఒళ్లో ఉంచుకుని ఒల్చినపండు
చేతబుచ్చుకుని వెండిగిన్నెలో వెన్నపట్టుకొని
పమిడి గిన్నెలో పాలు పోసుకొని

అమ్మా, నువ్వూ తిందువు గాని
అట్టా అట్టా రావె!

అని పాడుతూ మారాము చేస్తున్న బిడ్డకు గోరుముద్దలు తినిపిస్తుంది తల్లి. ఇలా చేయడం యీ నాటికీ తెలుగుతల్లికి సరదా. ఆ మాటకు వస్తే బిడ్డను పెంచడంలో తెలుగు తల్లిది ఒక ప్రత్యేకత.

## జోల పాటలు

వీటిని లాలిపాటలు అనికూడ అంటారు. జోల పాటలు తెలుగు తల్లి ప్రత్యేకత. ఈ పాటలలోనే తల్లి బిడ్డకు అన్ని విషయాలు చెబుతుంది. తల్లి హృదయానికి దర్పణంగా ముగ్ధమనోహరంగా జోలపాటలు ఉంటాయి. ప్రధానంగా యివి తల్లుల రచనలు. అనుశ్రుతంగా ఆ నోట ఆ నోట పాడబడడంచేత మార్పులకు చేర్పులకు గురికాబడ్డాయి. తల్లి తన ముద్దుల బిడ్డను దేవతలు ఆశీర్వదించాలని వేడుకుంటూ—

"శ్రీ రమ్య దేవా లాలీ! మా ముద్దు
చిన్నారి కూన లాలీ.
గారాల కూచి లాలీ మాయప్ప
కంజాత నయన లాలీ!
సకల లోక ధారుడా! మన కునో
జల జాత సంచారుడు
అకళంక గుణ పూజారుడు! మముబ్రోచు
ఆర్యా మనోహరుడా!
దేవేశుడా విధాత నీకూ తా
దీర్ఘాయు వొసగు గాత !!

అని కోరుకుంటుంది.

అయితే యిది పిల్లలకోసం రాసిన పాట కాదని కృష్ణశ్రీగారి అభిప్రాయం. ఇదే అభిప్రాయాన్ని ఆర్వియస్ సుందరం గారు తన సిద్ధాంత వ్యాసంలో కూడ వెలిబుచ్చారు. అయినా ఇవి పిల్లల పాటలుగానే చలామణి అవుతున్నాయి. తల్లికి బిడ్డను జోకొట్టి, జోల పాడి, నిద్రపుచ్చి, తాను ఆనందించడమనేది ఒక చర్య మాత్రమే గాదు. అవ్యక్తానందాన్నిచ్చే మధురాతి మధురమైన దివ్యానుభూతి మాటలకు, ఆలోచనలకు అందనిది.

తెలుగు జోలపాటల్లో తాళ్ళపాక అన్నమయ్యగారి రచన "జో అచ్యుతానంద జో జో ముకుంద" చాల ప్రసిద్ధమైనది. పల్లెలలో పట్నాలలో ప్రతి గృహంలో ప్రాచుర్యం పొందింది. ఆ బిడ్డ తల్లికి కేవలం బిడ్డ మాత్రమేగాక—అచ్యుతమైన ఆనంద సంధాయకమైన ముకుందుడుగా కనుపిస్తాడు. తల్లి అలా ఊహిస్తుంది. ఆ తల్లి ఊహాలన్నీ అమృత ధారలుగా, రసవద్గంగలా అలవుగా ఆమె నోటినుంచి పాటలుగా జాలువారడం మనం చూస్తుంటాము.

"తొలుత బ్రహ్మాండంబు తొట్టిగావించి
నాలుగు వేదాలు గొలుసు లమరించి
బలువైన ఫణిరాజు పాన్పు సవరించి"

అనిపాడుతూ—తన బిడ్డను సాకుత్తూ బాల కృష్ణుడుగా భావించి

"లాలను పాడరమ్మా, ఈ బిడ్డ
లక్ష్మి విలాసుడమ్మా!
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ
వేదాంత వేద్యుడమ్మా
వేణు నాదంబుతోను ఈ బిడ్డ
వేదాంత వేద్యుడమ్మా
వేణునాదంబుతోను ఈ బిడ్డ
వేదములు పాడునమ్మా

అని గొప్పగా అవ్యక్తానందంతో ఊహించుకుంటుంది. ఆ అమాయక పుత్తడి అమృతవల్లి.

## ప్రార్థన గేయాలు

ఇవి 6-14 వయసు లోపు బాలలకు సంబంధించినవి. వీటిలో ప్రార్థన గేయాలు, ఆటల పాటలు, పండుగ పాటలు, గేయ కథలు మొదలైన వెన్నో చేరి ఉంటాయి. బాల వాఙ్మయంలో మధురాతి మధురమైన భాగం యీ గేయాలు. భారతీయులకు, తెలుగు వారికి ప్రార్థన చేసి పని ప్రారంభించటం ఒక సంప్రదాయం. సంపుటీకరించు కొన్న సంస్కృతిలో అదొక భాగం. నిండు మనసుతో ప్రార్థన చేశాక ప్రారంభించిన పనులు జయప్రదం కాగలవని మన వారి ఆశ. అందుచేత తెలుగు బాల వాఙ్మయంలో అసంఖ్యాకంగా ప్రార్థనా గీతాలు వచ్చాయి. వేదిద కామేశ్వరరావు గారు "అభయహస్తం" అనే పాటలో—

"పిలిచితే పలుకుతావట!
నా పిలుపులో కులుకు తావట!
ఆపద మొక్కుల స్వామి
నీ సన్నిధి నా పెన్నిధి ||పి||
అభయ హస్త మున్నదట
అభయ మూర్తి నీ వెనట
అభయదాన మిచ్చి నాకు
భవ తరణ పథమ్ము జూపు —||

అని ఆపద మొక్కుల స్వామి శ్రీ వెంకటేశ్వరుని ప్రార్థనా గేయాన్ని బిడ్డలకు అందించి బహుళ ప్రచారం చేశారు. ఇలా ప్రతి దేవుడిమీద కవులు భక్తి గేయాలు ఆలాపన చేశారు. క్రైస్తవ విద్యార్థులు నిత్యం పాడుకొనే ఒక గేయం "కీర్తనలు-పల్లవులు" (1962) అనే ఒక గ్రంథం నుంచి స్వీకరింపబడినది.

"ఓ యేసు ప్రభువా
చిన్న పిల్లలను పాడుడి
మొర్రపెట్టు కుంటిని
చిన్నపిల్లలను-నా
మొరాలకించండి—చిన్నపిల్లను
కోడి తన రెక్కల క్రింద పిల్లను దాచినట్లు
నేడు మీ రెక్కల క్రింద
మమ్ముని దాయండయ్యా—చిన్న
పిల్లను"

ఈ గేయం రాగ తాళ యుక్తంగా పాడితే మనోహరంగా ఉంటుంది. ఇలాగే మతాల వారీగా కొన్ని గేయాలు కలవు.

## ఆటల పాటలు

తెలుగు వారి సాంఘిక జీవనంలో ఆటలు పాటలు ఒక ప్రముఖమైన పాత్ర వహిస్తాయి. నాగరిక వాతావరణంలో వీటి ప్రభావం తగ్గుముఖం పట్టినా పల్లెపట్టులలో ముఖ్యంగా పట్నాలకు, నగరాలకు సుదూరంగా నిర్మల మనోహరంగా ఉన్న వాతావరణంలో పాటల ఆటలు-లేదా ఆటల పాటలు ప్రచారంలో ఉన్నాయి. నన్నెచోడుని కుమార సంభవం, బసవ పురాణం, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, ధూర్జటి కాళహస్తి మహాత్మ్యం, శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, శివరాత్రి మహాత్మ్యం, తాళ్ళ పెద తిరుమలయ్య శృంగార దండకం మొదలైన కావ్యాలలో-ప్రబంధాలలో, అంతే గాక మహాభారతం మొదలుకొని నేటి వరకు గల శతాధిక రచనలలో ఆట పాటల ప్రసక్తి ఉంది. సురవరం ప్రతాప రెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో తెలుగు వారి ఆటల గురించి పలుచోట్ల ప్రస్తావించారు.

"పొందంగ రాగుంజ పోగుంజ లాట
కుందెన గుడిగుడి గుంచంబు లాట
అప్పళ విందుల యాట పల్మారు
చప్పట్లు వెట్టుడు సరి గుంజలాట

చెరబొంతల యాట చిట్ల పోట్లాట
గోరెంత లాట దాగుడుమూత లాట

పైన వివరించిన ఆరు పంక్తుల పద్యంలో ఎనిమిది ఆటల ప్రసక్తి తేబడింది. ఇలాగే తెలుగు నాట నేటికీ అచ్చన గండ్లు, అరంకి, అందలాలు, ఉలకూతలు, ఉప్పన బట్టలు, ఓమనగుంటలు, కనుమూసిగంతలు లేదా దాగిలి మూతలు, దాగ్గిలి ము చ్చు లు, యిలాగ ఎన్నో ప్రచారంలో ఉన్నాయి. ఇహ వీటితో వేసిన పాటలు సరేసరి. ఆడుకునే టప్పుడు పాడుకోడానికి అనువు తమిళంలో రాసిన గేయాలను "అమ్మనై" అంటారు. మరో పాట అందు కుంటారు సందర్భాన్ని బట్టి.

"వానా వానా చెల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప
కొండ మీద గుండురాయి
కొక్కురాయి కాలు విరిగె దానికేమి మందు?
వేపాకు పసుపు, వెల్లుల్లిపాయ నూనెలో మడ్డి
నూటొక్కసారి
పూయవోయి ఒకసారి
పూటకొక్కసారి"

అని వైద్యవిషయాలను కూడ ప్రసక్తాను సారం చెబుతారు. మరోపాట చూడండి.

"కాళ్ళగజ్జి కంకాలమ్మ
వేపాచక్క వెలగా మొగ్గ
మొగ్గాకాదు మోదుగ నీరు
నీరుగాదు నిమ్మల వారి
వారిగాదు వాయింట కూర
కూరగాదు కుమ్మరి చట్టి
చట్టిగాదు చాగ మరి (ట్ట)
మట్టాతీసి, నీ మొగుడు కాలు ముస్త"

ఈ పాట ఆటతో బాటు కాళ్ళకు గజ్జి పుండ్లు వస్తే దానికి మందు యిలా చెప్పబడింది. కంకాలము= కచూరాలు, వేపచుక్క, వేగు చుక్క=బావంచాలు, వెలగా మొగ్గ=పాదరసం మోదుగ నీరు= మోదుగ మండలు, నిమ్మల వారి=నిమ్మరసం, వాయింటాకు, చాగమట్ట వీటన్నిటిని మట్టి చట్టిలో కాచి, కలియబెట్టి రాస్తే గజ్జి మాయమౌతుందని వేదాల రామానుజ స్వామి, డా: వేటూరి శంకరశాస్త్రి గారలు చక్కని అర్థాలను చెప్పారు. ఈ విధమైన దేశీయ క్రీడల వివరాలను నేదునూరి గంగాధరం గారు "ఆటల పాటలు" అనే గ్రంథంలో ఎంతో సమగ్రంగా సచిత్రంగా వివరించారు. ఆటలలోని వాడుక మాటలకు అర్థాలనుగూడ వివరించారు. వాస్తవానికి తెలుగు దేశంలోని పిల్లల ఆటలు ఒక ప్రత్యేక పరిశోధనాంశంగా స్వీకరించ దగిన పరిధిగల అంశం.

## పండుగ పాటలు

పిల్లలకు, పెద్దలకు అత్యంత ప్రీతిపాత్రమైన పెద్దపండుగ ఉగాది. దీన్ని తెలుగు వారు ప్రపంచంలో ఏ ప్రాంతంలో ఉన్నా ఓపినంతలో ఘనంగా పండువుగా యీ పండుగ చేస్తారు. చేదు పచ్చడి రుచి చూస్తు సుఖప్రదమైన జీవితం ఏడాది పొడుగునా ఉండాలని కోరుకుంటారు.

"ఉగాది పండుగ వచ్చింది
వేపా బజ్జీ తిన్నాము
…………
అమ్మ నాన బావా అక్క
అన్నా వదినె అందరు నాడు
కొత్త బట్టలు కట్టాము
పిండి వంటలు తిన్నాము."

ఇది దక్షిణ సర్కారు జిల్లాలలో ఉగాది

రోజున పిల్లలు ఆనందంగా పాడుకొనే ఒక పాట. మిగతా ప్రాంతాలలో కూడ బిడ్డలు యిలాగే పాడుకొంటారు. పాటలలో కొద్ది పాటి భేదాలుండడం సహజం.

పిల్లలు పూర్తిగా పాల్గొని ఆనందించే పండుగ వినాయక చవితి. పిల్లలకు నిత్య జీవితంలో విఘ్నాలు కలుగకుండా చదువు సాములు కొనసాగాలని వినాయకుని మొక్కుకుంటారు. ఉదయమే లేచి స్నానాదికాలు ముగించుకొని వేప పచ్చడి రుచి చూచి వినాయకుడికి ఉండ్రాళ్ళు పోసి, తాము విందారగిస్తారు. పూజా వ్రత కల్పం పూర్తయే సందర్భంలో పిల్లలందరు లేచి చివరి సారి ప్రార్థన చేస్తారు.

"విఘ్నము కాకుండ
విద్య నియ్యవయ్యా
విఘ్నేశ్వరుడ నీకు
వేయి దండాలు"

విద్యా వ్యాసంగంలో ఎట్టి యిబ్బందులూ లేకుండా చేయడానికి విఘ్నేశ్వరుని ఆశీస్సు అవసరమని మనవారి అభిప్రాయం. అది భారతీయ సంప్రదాయం. పిల్లలు బాగా పాల్గొనే పండుగలలో దసరాను మించింది లేదు. దాదాపు రెండుదశాబ్దాలకు పూర్వం దీనికి ఎంతో ఆదరం ఉండేది నాగరికతా ప్రభావం యీ పండుగను బాగా నొక్కి-వేసింది. చిట్టితమ్ముళ్ళూ, చిట్టి చెల్లెళ్ళూ మహార్నవమి పండుగ వచ్చేసరికి "జయ విజయీభవ ద్విజయీభవ" అని బడిపిల్లలంతా గొంతెత్తి పాడుతూ ఉండే దినాలు గతించాయి. అందువల్లె బిడ్డలలో కలుపుగోలు తనాలు, ఉత్సాహము, ఉపాధ్యాయులకు బిడ్డల తలిదండ్రులతో సంబంధాలు తరిగిపోయినవని చెప్పవచ్చు. ఆర్థికావసరం కోసం కాకపోయినా, పై అవసరం కోసం ఈ పండుగ సందర్భంగా తల్లిదండ్రులను ఉపాధ్యాయులు పిల్లలు కలుసుకొనే అవకాశాన్ని పునరుద్ధరించవలసి యున్నది. దసరా సందర్భంగా పిల్లలు పాడే పద్యాలలో ఎన్నో ఫణితులున్నాయి.

"ధర సింహాసనమై నభంబు గొడుగై
తద్దేవతల్ భృత్యులై పరమామ్నా
యములెల్ల వందిగణమై"

ప్రార్థనా పద్యంతో ప్రారంభం-వినాయకుని మీద పద్యాలు, సరస్వతిమీద, శివునిమీద ఆంజనేయునిమీద పద్యాలు చెబుతారు. సరే-ఆనాడుగల బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, మీద పద్యాలు చెప్పి అయ్యవారికి ఐదు వరహాలీయకపోతే-లోభివాని మీద

"బాలురము వస్త్రమిటు పరగ నతిప్రేమ
మా ముద్దు చెల్లించి మము బంపవలయు
పసి బాలకుల మేము బడలి యున్నాము
పసి గడితిమి యెండవానలకు సొలసి
రేపు రా మాపు రమ్మనక
తేప తేపకు మమ్ము తిరిగి రమ్మనక
అల్లుళ్ళవలెగాదు అలిగి మిమ్మడుగ
తగవువారము గాదు దండి:చి యడుగ"

ఇలా చెప్పుకుంటూ పోయి-ఎలాగో అయ్యవారిని తృప్తిపరచి-అందరూ కలసి

"శ్రీరస్తు విజయోస్తు దీర్ఘాయురస్తూ
ధనకనక వస్తు వాహన సిద్ధిరస్తు
కారుణ్యముగ మీకు కల్యాణమస్తు
ఆశ్వయుజ శ్రీ శుద్ధ మహార్నవమినాడు

శాశ్వతా శీర్వాద సత్యవాక్యములు
బాలకుల దీవనలు బ్రహ్మదీవనలు"

అని దీవిస్తారు. ఇలాటి తెలుగు పండుగలు ఎన్నో వున్నాయి.

## గేయ కథలు

పావలకు, పిల్లలకు గేయాలంటే చాల యిష్టం. కథను గేయంలో మలిస్తే అది గేయకథ అవుతుంది. వీటినే కథాగేయాలు, పాట కథలు, చిత్రకథా గేయాలు,– అని అంటున్నారు. అయినా ప్రచారనామం గేయ కథలు మాత్రమే." కథలను కథలుగా కాక, గేయ కథలుగా వ్రాయడం కవితా విన్యాసం! గేయ కథలు–చదువుకోడానికి చాల హృద్యంగమంగా ఉంటాయి. "గేయం పద్యం కంటే లయబద్ధంగా నడుస్తుంది గనుక గేయాలకు, గేయ కథలకు మంచి ప్రచారం వచ్చింది. గేయ కథల్లోని నీతులు పసిడి హృదయాలలో చక్కగా హత్తుకుంటాయి. ముందు ముందు వాళ్ళ ఉన్నతులు కావడానికి ఉపయోగపడతాయి. ఈ విషయాన్ని గమనించి బాల సాహిత్య వేత్తలు యీ ప్రక్రియ ఎడల ఆదరణ చూపి వందల సంఖ్యలో గేయ కథలు రాశారు. గేయ కథా రచనకు ఆద్యుడుగా గిడుగు వెంకట సీతాపతి గారినే చెప్పుకోవచ్చును. సీతాపతిగారు గుంటూరు నుంచి వెలువడే క్రైస్తవ మిషనరీల పత్రిక "వివేకవతి" లో 1909 లో "చిలకమ్మ పెళ్ళి" "ఎలుక–పిల్లి" గేయ కథలను రాసినట్లు చెప్పుకున్నారు. పైగా ఈరచనలు "గ్రాంథిక భాషలో లేనన్న కారణమున పెద్దల మన్నన పొందలేదని" కూడ బాధ పడ్డారు." అయినప్పటికీ "చిలకమ్మ పెండ్లి" గేయం తొలిగేయాలలో ఒకజాతి రత్నం, ఎత్తుగడలో, నడకలో దానికదే సాటి నాటికీ, యీ నాటికీ.

"చిలుకమ్మ పెండ్లి యని
చెలికత్తె లందరూను
చెట్లు సింగారించి
చేరియున్నారు.
పందిట పిచ్చుక సందడి చేయగ
కాకులు మూకలు బాకా లూదగ
సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెండ్లికుమారుడు బింకము చూపగ
సీతాకోకల చీర కట్టుకొని
పెండ్లికుమారిత ప్రేమచూపగా"

గేయ కథలకు చందమామ పత్రిక యిచ్చిన ప్రోత్సాహం యింతింత అనరానిది. తొలిదినాల నుంచీ కవిబ్రహ్మ ఏటుకూరి వెంకట నరసయ్య గారు గేయ కథలకు మంచి ఒరవడి పెట్టారు.

తొలితరం యిచ్చిన ప్రోత్సాహంతో ఉత్పల, కవిరావు, నార్ల చిరంజీవి, బి. వి. నరసింహారావు, బోయి భీమన్న, వేజెండ్ల సాంబశివరావు, ఆలపర్తి వెంకటసుబ్బారావు, కె. వి. రమణారెడ్డి, కే. సభా, మధురాంతకం రాజారాం, నండూరి రామ మోహన రావు, శ్రీనివాస కాశ్యప, విద్వాన్ విశ్వం, మేడిచర్ల ఆంజనేయమూర్తి ఎల్లోరా, సమతారావు, తాళ్ళపూడి వెంకట రమణ, సిద్ధాంతి మల్లిఖార్జునం, అడ్డుమల్లి పూర్ణచంద్రరావు, కమ్మిశెట్టి వెంకటేశ్వర రావు వారణాసి, ఆళ్ళ రాఘవయ్య, ప్రభృతులు రచనలు చేసిన వారిలో ఎన్నదగినవారు.

కవిరావుగారు గేయ కథా రచనలో ప్రత్యేకమైన పరిశ్రమ చేశారు. తనదైన ఒక ప్రత్యేక పంథాలో వందలాది గేయ కథలు రాశారు. ప్రచారంలో గల కథలను తీసుకొని హృద్యంగమమైన ధోరణిలో చెప్పారు. "చెలిమి" అనే గేయ కథలో

పట్టి కడవ, రాగి కడవలతో స్నేహం వర్ణించబడింది. గేయ కథాంతంలో

"నిన్ను మించి నట్టి వారి
నేస్త మెపుడు
చేయరాదు; చేతు వేని
చేటు గల్గును"

అనే నీతిని బోధిస్తారు. వియ్యానికైనా, కయ్యానికైనా యీడూ జోడు ఉండా లంటారు. అది బిడ్డలు కూడ తెలుసుకొని మసలు కోవాలని వారి ఆకాంక్ష. గేయ కథా రచనలో బి. వి. నరసింహారావు గారికి ఒక ప్రత్యేకత ఉంది. ఉపాధ్యాయుడుగా తనకు గల అనుభవాన్ని పురస్కరించుకొని పిల్లలలో సహజంగా గల హేతు వాద శక్తిని "ఆవూ- హరిశ్చంద్ర" "ఏకలవ్యుడు", "ప్రహ్లాద," "జాబాలి బిడ్డ" మొదలైన కథలలో అద్దం పట్టినట్లు చూపుతారు. పంతులుగా రొక రోజున పాఠాలై పోయాక ఆవూ-పులి కథ, సత్య హరిశ్చంద్రుని కథ-రెండూ పూర్తి చేసి ఏ కథ బావుందని పిల్లలను అడిగారు. ఆవూ-పులి కథ బావుందన్నారు. ఎందుకని! అని ప్రశ్నించారు పంతులుగారు. జంకు గొంకు లేక ఒక పిల్లవాడు సమాధానం చెప్పాడు,

"హరిచంద్ర చక్రవర్తి....
భార్య నమ్మి బిడ్డ నమ్మి
కరుణ లేని వాడటన్న
ఘనత కూర్చుకొనెను చాలు.
ఆవు తల్లి యట్లు గాక
ఆడి తప్పలేదు పైగ
కన్న లేగ కమ్మె పాలు
కడుపు నిండ యిచ్చి తిరిగి
క్రూర జంతు బలికి తాను
దీనముగ నడచి వచ్చె"

అని ఆవు కున్న గొప్పదనం హరిశ్చంద్రునికి లేదని చెప్పాడు. ఇటువంటి కథలు బిడ్డలలో ఆలోచన పెంపొందించ డానికి కారణ మౌతాయి.

## 4 పిల్లల రచనలు

వయసు వచ్చేవరకు పిల్లలలో ఊహాలు పెరుగుతూ ఉంటాయి. వ్యక్తిత్వం పెరుగుతూ ఉంటుంది. ఆ సమయంలో తోటి పిల్లలతో కలసి కొత్తమాటలు నేర్చుకుంటాడు. పాటలు కడతాడు. సరదాగాపాడుకుంటాడు. ఈ పాటలలోని పదాలకు అర్థం ఉండచ్చు ఉండకపోవచ్చు. ఈ సందర్భంలో బాలలకు భావ సౌష్టవం కుదుర్చుకునేంతటి కల్పనా శక్తి ఉండదు. అందుకనే ఈ పాటలను అర్థంలేని పాటలని నాన్‌సెన్స్ రైమ్స్ అని పాశ్చాత్య పండితులు అభిప్రాయ పడినట్లు Encyclopedia Americana వలన తెలుస్తున్నది కేవలం ఈ పాటలలో అర్థమే లేదని కొట్టి పారవేయ లేము. యోచన చేస్తే అర్థం ఉంటుంది. అర్థం, భావం ఊహ కల్పన లేకపోతే గేయమే నిలవదు.

స్థూలంగా యీ రచనలను పిల్లలరచనలు అనొచ్చు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దీన్ని "దుడుకు కవిత్వం" అన్నారు.

పంతులు గారిని ఎగతాళి చేస్తూ వారు కల్పించిన గేయం-

"పంతులు పంతులు
పావుసేరు మెంతులు
కూర్లోకి చాలవు
గుప్పెడు మెంతులు
మంచా మెక్కిం వంచా
పంతుల్నేసి దంచా!
రోట్లో వేసి రుబ్బా
రొట్టె గాల్చుకు వొచ్చా"

ఇలాగే పిల్లల ఆలోచనలు తెలియ జేసే మరి కొన్ని గేయాలు రాక పోలేదు. కల్పనా దీప్తి అని ఏడేళ్ళపాప రాసిన మరో గేయం చూడండి—

"దిన్నా బొమ్మా
కమ్మని బొమ్మా
ఎందుకు అమ్మా
ఏస్తాని కమ్మ
ఆ బొమ్మ చూచి
ఈ బొమ్మ వస్తే
ఎంత బాగుంటుంది
ఆహా ఆహా...."

అని నవ్వుతుంది. ఇందు సహజమైన లయ, యతి సంభావనా చాతుర్యం ఉన్నాయి. ఎందుకు అమ్మా—ఏస్తానికమ్మా" అని "ఎఏ" లకు యతి పాటించడం జరిగింది. అప్రయత్నంగా సాగిన రచనలో సహజయతి అది.

ఇలాంటి గేయాలు ఆంగ్లంలో వందలు వేల సంఖ్యలో ఉన్నాయి. ఆ పిల్లలు వీటిని ఆనందంతో పాడుకుంటూ ఉంటారు.

# ప్రజాస్వామ్యం!?

మందరపు హైమవతి

ఒక్కసారిగా ప్రభుత్వం
ప్రజాస్వామ్యం నుంచి
నియంతృత్వంలోనికి మారినట్లు
ఎండాకాలం వచ్చేసరికి
నియంతగా మారిపోతాడు సూర్యుడు
అధికారంలో పాదుకోగానే
నిషేధిస్తాడు వాక్స్వాతంత్ర్యాన్ని
జారీచేస్తాడు ఆజ్ఞలు ఎల్లెడలా
నిశ్శబ్దం! నిశ్శబ్దం! నిశ్శబ్దం!
ఆ పై ఎంత విందామనుకొన్నా
ఎక్కడ వినిపిస్తుంది ఏ చిరు శబ్దం
ఎన్ని దిక్కులు వెదికినా
ఎక్కడ కనిపిస్తుంది ఏ గాలి అలజడి

స్వేచ్ఛా జీవన లోలురు
ధైర్యపు పాలెక్కువైనవారు
ఎప్పుడూ ఉంటూనే ఉంటారు
మౌనం సంకెళ్ళు వేసి
ఎంత కదలకుండా బంధీ చేసినా
అడపాదడపా అక్కడోక తరువు
ఇక్కడోక తరువు
చైతన్య గీతం పాడుతూనే వుంటుంది
ఎంత గొంతుక నొక్కివేసినా
ఏదో ఒక రాగం తీయక మానదు
అప్పుడోక పులుగు ఇప్పుడోక పులుగు
తుపాకి గుండు దూసుకుపోయి
మరణిస్తూ కూడ. నినాదాలు పలికే
విప్లవకారునిలా—
గాజు గోళీతో గళం బిగించినా
కీచుమని ధ్వని చేస్తూనే ఉంటాయి
ఒకటి రెండు సోడాలు
ఈ ధిక్కారాన్ని భరించలేక
ఆఖరికి విధిస్తాడు కర్ఫ్యూ
ప్రకటిస్తాడు గృహనిర్బంధాన్ని
బాటసారుల వియోగానికి
రహదారి గుండె కరిగి కరిగి
తారు కన్నీటి బొట్లు రాలుస్తుంది
అబ్బ! ఈ పరిపాలన ఎన్నాళ్ళు
ఇక ఎగరనే ఎగరదా
ఎప్పటికీ ప్రజాస్వామ్యపతాకం!

అప్పుడు అంతా కలసి ఆలోచించారు
నియంత గుండెల్లో
తిరుగుబాటు ధ్వజం నాటారు
జైళ్ళనుంచి విడుదలైన బందీల్లా
ఆనందపు జల్లుల్లో తడుస్తూ
రోడ్లనిండా జనం! జనం! జనం!

* * *

# దివిసీమ సాహితీ సమితి

సనకా సుబ్బారావు
కార్యదర్శి

లలితకళలకు నెలవై సాహితీ స్రష్టలను ద్రష్టలను సృష్టించిన దివిసీమలో గాంధీక్షేత్రం గాంధీజీ శతజయంతి సందర్భంగా నెలకొని వివిధ సంస్థల ద్వారా సమాజ సేవకు పూనుకొని సాగిస్తున్న కృషిలో దివిసీమ సాహితీ సమితి తన ప్రత్యేకతను ప్రదర్శిస్తూ వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తూ పురోగమిస్తున్నది.

శ్రీ కావూరి వెంకటరామయ్య గారి అధ్యక్షతలో ఈ దివిసీమవాసులైన కవులు రచయితలు కవితాగానాలు తరచు సాహితీ సమితిలో గాంధీక్షేత్ర వేదికల మీద చేసి ప్రాంతీయ రసజ్ఞులలో సాహితీ ప్రీతిని పునరుజ్జీవింపజేస్తూ వచ్చారు.

ఈ సీమలోని వివిధ గ్రామాలలో కూడ త్రైమాసిక సాహిత్య గోష్ఠులు నిర్వహించాలనీ, సెలవు రోజులలో విద్యార్థులను సమావేశపరచి సమర్థులైన పెద్దల నాహ్వానించి వివిధ విషయాల మీద ఉపన్యాసాలిప్పించి విజ్ఞానాభివృద్ధి కలిగించాలనీ, మహానుభావుల జయంత్యుత్సవాలు జరపటం ద్వారా యువజనతలో ఉత్తేజం కలిగించాలనీ, దివిసీమను దివ్యసీమగా రూపొందించాలనే శ్రీ మండలి వారి సంకల్పంలో సాఫల్యసిద్ధికి సాహితీ సమితి కూడ కృషి చేయాలనీ, ఇటువంటి ఆశయాలతో సాగించే సాహితీ యాత్రలో కొన్ని మజిలీలు-కొంత ఉత్తేజం ఎంతో ఉత్సాహం పొంది ముందుకు సాగాయి.

ఆరంభంలో ఈ సీమలో ప్రస్తుతం కవితా వ్యవసాయం చేస్తున్న పెద్దలు, పిన్నలు యువకులు మా సాహితీ సమితి సమావేశాలలో పాల్గొంటూ తమ తమ కృషి స్వరూపాన్ని మా కందించి ఆనందింపచేసే వారు. క్రమంగా గాంధీ జయంతి సందర్భాలలోను, విజయ దశమి, ఉగాది మొదలైన పండుగలలోను సాహితీ సమితి ప్రముఖ కవి చంద్రుల నాహ్వానించి సాహితీ పర్వాలు నిర్వహించింది.

రవీంద్ర కవీంద్రుని జయంత్యుత్సవం గాంధీక్షేత్ర విద్యా సంస్థల అధ్యాపక విద్యార్థినీ బృందాలను సమావేశపరచి సంతోషప్రదంగా సాహితీ సమితి జరిపింది. ఉపాధ్యాయదినోత్సవాలు వేడుకగా జరపటం కూడ ఈ సంస్థకు పరిపాటి. ప్రేమచంద్ శతజయంతి సభలు, వీరేశలింగ వర్ధంత్యుత్సవాలు జరిపిన ఈ సంస్థ దేవులపల్లి వారి సంస్మరణ సభ జరిపి వారి సాహిత్యం సమీక్షించింది.

8-10-76 తేదీని కవి పాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావుగారి అధ్యక్షతలో కవి సమ్మేళనం జరిగింది. అధ్యక్షులు సాహితీ సమితి సభ్యుల కుత్తేజం కలిగించారు. 4-8-77 నాడు శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారి జన్మదినోత్సవ సందర్భంగా శ్రీ దాశరథి అధ్యక్షతన దివిసీమ సాహితీ సమితి బృహత్కవి సమ్మేళనం జరిపింది. ఈ సమ్మేళనంలోనే శ్రీ కరుణశ్రీ తమసంకలన మైన "కళ్యాణ కల్పవల్లి" ని శ్రీ మండలి వారి కంకితం చేశారు. ఇందులో శ్రీయుతులు పువ్వాడవారు, గురుజాడ వారు, జమ్మల మడక వారు, ప్రసాదరాయకులపతి, జ్ఞానానంద కవి మొదలైన వారితో శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ గారు కూడ పాల్గొని వీనుల విందుగా కవితాగానాలు చేశారు. కన్నుల పండువుగా ఇటువంటి కవి సమ్మేళనాలు సమితి తరువాత చాల నిర్వహించింది.

8-10-77 నాటికి ఆస్థాన కవియైన శ్రీ దాశరథికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు గారి అధ్యక్షతన ఆరోజున సన్మానం జరుపబడింది.

ఉత్సాహంగా ముందుకు సాగుతున్న సాహితీ సమితి దివిసీమలో సంభవించిన పెనుతుఫాను తాకిడి తట్టుకొని నిలబడింది. 77 వ సం॥ నవంబరులో గాంధీక్షేత్రం తుపానువల్ల మృతశేషులైన దివి సీమ ప్రజల హాహాకారాలతో నిండిపోయింది. ఆర్తులైన దీనజనాన్ని గాంధీక్షేత్రంఆదుకొని అన్న పానాలిచ్చి ఆదరించింది. జీవశక్తి క్షీణించిపోయి నిరుత్సాహంలో మునిగిపోయిన జన జీవనానికి చైతన్యం కలిగించాలనే ఉద్దేశ్యంతో దివిసీమ సాహితీ సమితి ఆంధ్రసాహిత్య ఎకాడమీ ఆధ్వర్యంతో దివిసీమలో కవిసమ్మేళనాలు చేసి సామాన్య జీవనంలో సాహితీ సంజీవనం సముత్పన్న చేసింది. ఇది ఒక విచిత్రమైన క్రాంతి పథంలో సంభవించిన సంక్రాంతి ఆ పండుగ లలో 18-1-78 తేదీని కోడూరులో ప్రజా సమూహంలోకి సమాజ సహజజీవనంలో ప్రకాశం కలిగించిన పెద్దలకు డాక్టరు సి. నారాయణరెడ్డి అధ్యక్షులయ్యారు. శ్రీయుతులు ముదిగొండ వీరభద్రమూర్తి, నీలా జంగయ్య, మహమ్మద్, శ్రీమతి నాయని కృష్ణకుమారి, డా. సి. ఆనందరామం. జ్యోతిర్మయి గారలు తమతమ కవితా గానాలలో బాధితుల నోదార్చి సృష్టి స్వరూపం గురించి యినుమడించిన ఉత్సాహంతో పురోగమించాలనే సందేశ మందించిన జనజీవనాన్ని ఉత్తేజ పరచారు.

14-1-78 అవనిగడ్డలో పువ్వాడవారు అధ్యక్షులయ్యారు. శ్రీయుతులు గురుజాడ రాఘవశర్మ, నారాయణ రెడ్డి ప్రభృతులు కవితాగానం చేశారు.

15-1-78 నాడు శ్రీ ఆవుల సాంబశివ రావుగారి అధ్యక్షతలో శ్రీ యుతులు అమరేంద్ర, డా. అడపా రామకృష్ణరావు ప్రసాదరాయ కులపతి పాల్గొని సాహిత్యోత్సవం జరిపారు.

8-5-78 వ తేదిని శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారి అధ్యక్షతన స్థానిక కవుల లలో శ్రీ పువ్వాడ వారు, తుమ్మల శ్రీరాములు గారు మొదలైన ప్రముఖు లతో కూడిన కవి సమ్మేళనం జరిగింది.

15-8-78 వ తేదీని స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంగా శ్రీ పాలపర్తి సుబ్బారావు గారి అధ్యక్షతన డా॥ పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ గారు అష్టావధానం చేశారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ప్రభాకర్ జీ చేత శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారు అవధాని గారికీ పృచ్ఛకులైన సాహితీ సమితి సభ్యులకు సన్మానాలు చేయించారు.

అందకు ముందే ఆ సంవత్సరం అనగా 4-8-78 తేదీని శాసన మండలికి సభ్యులుగ నియమింపబడిన శ్రీ బోయి భీమన్న గారికి మంత్రి శ్రీ సి. దాస్ అధ్యక్షతన జరిపిన సన్మాన సభలో సాహితీ సమితి కవిసమ్మేళనం జరిపింది. సమ్మేళనానికి శ్రీ బోయి భీమన్న గారధ్యక్షత వహించి తమ ఆంగ్ల కవిత చదివి వినిపించారు. గతంలో వచ్చినతుపాను భీభత్సాన్ని స్మరిస్తూ సృష్టి చిత్రాన్ని తాము కవితలో వెల్లడించిన తీరు వివరించారు.

20-11-78 తేదీని దివి సీమ సాహితీ సమితి తన ప్రచురణ, డా. బి. వి. ఆర్. ప్రసాదరావు రచించిన "ఉప్పెన నాటి ఉదంతాలు" పుస్తకాన్ని ప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఎమ్ చలపతిరావు గారు ఆవిష్కరించారు. శ్రీ తుర్లపాటి కుటుంబ రావు గారధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా జరిగిన కవి సమ్మేళనంలో శ్రీయుతులు మల్లాప్రగడ రంగారావుగారు మొదలైన వారు పాల్గొన్నారు.

ఈ విధంగా ఉగాదికి అష్టావధానాలు మొదలైనవి జరుపుతున్న సాహితీ సమితి నాట్యావధానం కూడ శ్రీ స్వర్ణ రాజ హనుమంతరావు గారి చేత జరిపించి సామాజికుల నుత్సాహపరచింది.

పుస్తకావిష్కరణలు, పుస్తకప్రచురణలు సాగించాలనే సంకల్పంతో పురోగమిస్తున్న సాహితీ సమితి 6-4-82 వ తేదీని శ్రీ జోశ్యుల సూర్యనారాయణ మూర్తి రచించిన "భారతం" అనే చిన్న కావ్యాన్ని ఆవిష్కరించి కృతి సమర్పణ చేసే కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ సభకు శ్రీ భావరాజు నరసింహారావుగారధ్యక్షులు, శ్రీ కోట సుందరరామశర్మగారు గ్రంథాన్నావిష్కరించి సాహిత్యోపన్యాసం చేశారు. కృతికర్త తన మేనమామగారు శ్రీ వెంపరాల శ్రీరామమూర్తి గారికి కృతి సమర్పణ చేశారు. కృతిపతి కృతికర్తనాశీర్వదించారు. ఈ విధమైన తన పురోగతిలో నేటికి సాహితీ సమితి జిల్లా రచయితల మహాసభలు నిర్వహించే అదృష్టం కల్గినందుకు ఆనందిస్తోంది.



# దివి సీమ

మండలి బుద్ధప్రసాద్

మహాసాగరాన్ని చేరుకొనే ఆ వేగంలో కృష్ణవేణి సాగర సంగమ స్థలం చేరువలో రెండు పాయలయింది. ఈ ఉభయ వేళీ మధ్యంలో ఏర్పడిన దీవి-దివి సీమగా ప్రసిద్ధి పొందింది. ఈ ప్రాంతం సస్య సమృద్ధిగల దేశం – తృణకాష్ఠ జల సమృద్ధిగల సీమ వాసయోగ్యం కాబట్టి ప్రకృతిరమణీయకంలో కూడిన పచ్చని తోటలు పంట పొలాలు ఈ సీమని స్వర్గ సీమగా రూపొందించాయి. ఇప్పుడిది దివ్య సీమ కావాలని ఇది జన్మభూమిగా నివసించే ప్రజలు స్వర్గము కంటే మిన్నగా దీని నెన్నుకొంటున్నారు.

1984 లో పులిగడ్డ వద్ద కృష్ణానదిపై నిర్మించిన "అక్విడక్టు" వల్ల నదిమీదుగా కాలువ ప్రవహింప జేసి దివిసీమకు కృష్ణా జలాలు సప్లయి చేస్తూ ఉండటంతో ఈ సీమ సస్యశ్యామలం అయ్యే అవకాశం కలిగింది. అక్విడక్ట్ పైన సిమ్మెంటు రోడ్డు నిర్మాణం చేయబట్టి దివిసీమ ఇకమట్టుకు తానొక దివి గానే ఉండిపోక ఇతర ప్రాంతాలకు దగ్గరయింది. ఇప్పుడు దివి సీమలో సముద్ర తీరం వరకు ఉన్న ఊళ్ళ కన్నింటికీ బస్సు సర్వీసులు ఏర్పడి ప్రయాణ సౌకర్యాలు పెంపొందాయి.

దివిసీమ వివిధ కళలకు కాణాచి, తెలుగు వారి కళా వైదుష్యాన్ని దిగంత పరివ్యాప్తం చేసిన ఒక్క కూచిపూడి చాలు ఈ సీమ కీర్తి శిఖరాల ఔన్నత్యాన్ని చూపించ టానికి! అదృష్టవశాత్తు ఆంధ్రసంస్కృత్యౌన్నత్య సముజ్జీవనానికి దోహదం చేసిన వివిధ సాంస్కృతిక ప్రక్రియలు ఇక్కడ ప్రవర్ధమాన మయ్యాయి.

తెనుగు పద పరిమళం ప్రపంచమంతటా వ్యాపింప జేసిన క్షేత్రయ్య మొవ్వ గ్రామస్థుడు. మొవ్వ గోపాలస్వామి మీద ఆయన వ్రాసిన పదాలలో తెలుగు మాధురి జాలువారుతుంది. నృత్యకళలలో విశ్వస్థాయిని నిలుప గలిగిన కూచిపూడి సంప్రదాయాన్ని ప్రసాదించిన సిద్ధేంద్ర యోగీంద్రులు కూచిపూడి వారు. ఇక కృష్ణలీలా తరంగిణి వ్రాసిన నారాయణ తీర్థులు దివిసీమవారని కొందరి విశ్వాసం. త్యాగయ్య గారికి గురువైన శొంఠి వెంకటరమణయ్య గారికి గురువైన వారు హరిరామయ్యగారు-వారు మొవ్వ వారే.

ఇటీవలి కాలంలో ప్రముఖ వాగ్గేయ కారులైన సువర్ణ దక్షిణా మూర్తి, హరినాగభూషణం, పారుపల్లి రామకృష్ణయ్య గారలు దివిసీమవారే. నాదస్వర విద్యలో విశ్వవిఖ్యాతుడైన దాలిపర్తి పిచ్చిహరి లక్ష్మీపుర వాస్తవ్యులు.

సాహిత్యోద్యానంలో ఎన్నో కావ్య కుసుమాలు పూయించిన కవివరేణ్యులు సయితం ఈ సీమలో చాల మంది వర్ధిల్లారు. ముద్దుపళని, పింగళి సూరన, ఈ సీమ వారంటారు. శతక సాహిత్యంలో అజరామర కీర్తి నార్జించిన కాసుల పురుషోత్తమ కవిది పెదప్రోలు. ఆంధ్ర నాయక శతక పద్యాలు తెలుగు తోట నాటిన చమత్కార సీసాలు.

ప్రసిద్ధ పండితులు, విమర్శకులు, వాఙ్మయ పరిశోధకులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పెద్దకళ్ళేపల్లి వాస్తవ్యులు. అల్పాయుష్కులైన "హంపీక్షేత్ర" కావ్యం ద్వారా చిరయశస్కులైన కొడాలి వెంకట సుబ్బారావుగారిది పెదకళ్ళేపల్లే. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి స్వగ్రామం చిట్టూర్పు. బహుభాషా పండితులు నాటక కర్త, నాదెళ్ళ పురుషోత్తమ కవి సీతారామపుర అగ్రహారీకుడు. "తాజ్ మహల్" వంటి ఉత్తమ కావ్యాలతో బాటు "పృథ్వీపుత్రి" వంటి మేటి నాటకాలు రచించిన కవిపాదుషా పువ్వాడ శేషగిరిరావుగారి స్వగ్రామం మొవ్వ. కూచిపూడి పేరు చెప్పినప్పుడు నాట్యసరస్వతి సాక్షాత్కార మవుతుంది. నందికేశుని 'అభినయ దర్పణం' ఆధారంగా సశాస్త్రీయం ప్రదర్శించే కూచిపూడి నృత్యం దివిసీమ కళారంగంలో మణిపూస వంటిది. అక్కడ ఎందరో నాట్యాచార్యులు వర్ధిల్లారు, చింతా వెంకటరామయ్య, వెంపటి వెంకటనారాయణ, వేదాంతం రాఘవయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ, భాగవతుల రామకోటయ్య ప్రభృతులు ఈ కళకు చేసిన సేవ అపారమైనది. వెంపటి చిన సత్యం, వేదాంతం సత్యనారాయణ శర్మ ఈనాటి సుప్రసిద్ధ కూచిపూడి నాట్యాచార్యులు. ఈ సీమలో అనేకమంది నటశిఖామణులు ప్రవర్ధమానులయ్యారు. వీరిలో ప్రథమ గణ్యులు శ్రీ గోవల్లె హనుమంతరావు, దైతా గోపాలం, తుంగల చలపతిరావు, యడవల్లి సూర్యనారాయణ గారలు. వీరందరు ఆంధ్రనాటక రంగానికి విశేష సేవ చేసి ఖ్యాతిపొందినారు. ప్రజానాట్య మండలిలో ప్రముఖ పాత్రవహించిన సిర్విశెట్టి సుబ్బారావు, కోసూరి పున్నయ్య, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు గారలు ఈ ప్రాంతం వారే.

స్వాతంత్ర్యోద్యమంలో దివి సీమ అగ్రగామిగా నిలిచింది, స్వాతంత్ర్యోద్యమంలో ప్రముఖ పాత్రవహించిన గొట్టిపాటి బ్రహ్మయ్య, కొడాలి ఆంజనేయులు ఈ ప్రాంతం వారే. కృష్ణాపత్రిక ద్వారా ప్రజలనుత్తేజపరచిన ముట్నూరి కృష్ణారావు గారు ఈ సీమ వారే. కాంగ్రెసు పతాకాన్ని రూపొందించిన పింగళి వెంకయ్య గారిది దివి సీమ.

తెలుగు దేశచరిత్రలో ప్రతి రంగంలోను ఏదోవిధంగా పెనవేసుకొని ఉన్నదీ దివి సీమ చరిత్ర. ఆంధ్రుల తొలి రాజధాని శ్రీకాకుళం ఈ సీమలోదే. ఇప్పటికీ అక్కడ ఆంధ్రవిష్ణు దేవాలయం భక్తుల నాకర్షిస్తోంది. శ్రీకృష్ణదేవరాయలీ దేవాలయాన్ని సందర్శించి ఆంధ్రవిష్ణువు ఆనతి మేరకు ఆముక్తమాల్యద రచించినట్లు చెప్తున్నారు. దక్షిణ కాశిగా పేరొందిన పెదకళ్ళేపల్లిలో

శ్రీ దుర్గా నాగేశ్వర స్వామివారి ఆలయం, మోపిదేవిలో శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి ఆలయం, హంసలదీవిలో శ్రీ వేణు గోపాలస్వామి ఆలయం ఈ ప్రాంతంలో ప్రసిద్ధి చెందిన పుణ్యక్షేత్రాలు.

కూచిపూడిలో శ్రీ సిద్ధేంద్ర కళాక్షేత్రం నిర్మింపబడి బాలబాలికలకు నృత్య విద్య నేర్పుతున్నది. అవనిగడ్డలో 1969 లో స్థాపింప బడిన గాంధీక్షేత్రం సేవాక్షేత్రంగా భాసిల్లుతున్నది. అనేక విద్యా సంస్థలతో అనాధశరణాలయంతో గాంధీక్షేత్ర సేవా ఆశ్రమాలు విద్యావైజ్ఞానిక రంగాలలో విశేష కృషి సల్పుతున్నాయి.

ప్రశాంత గ్రామీణ జీవన విధానంతో విరాజిల్లుతున్న దివిసీమ 1977 నవంబరు 10 వ తేదీని ప్రకృతి విలయ తాండవానికి గురయి వేలాదిమంది ప్రజలు మరణించారు. లక్షలాది మూగజీవాలు ఉప్పెనకు బలయినాయి. గ్రామాలకు గ్రామాలే నామ రూపాలు లేకుండా తుడిచి పెట్టుకు పోయాయి. ఈ శతాబ్దంలోనే పెద్దదిగా చెప్పబడిన యీ జల ప్రళయానికి గురైన దివిసీమ ప్రపంచాన్నంతనీ ఆర్తితో ఆకర్షించింది. ప్రపంచం నలుమూలల నుంచి వచ్చిన అనేక స్వచ్ఛంద సంస్థల సహకారంతో ప్రభుత్వ సహాయంతో అచిర కాలంలోనే తిరిగి పూర్వాన్నత్యాన్నందుకో గలిగింది. ధ్వంసమైన అనేక దివిసీమ పల్లెలు ఈనాడు పునర్నిర్మాణం పొంది కమ్యూనిటీ హాళ్ళతో నవ నూతన భవనాలతో కలకిల్లాడుతున్నాయి.

కొంత కాలంగా మరుగున పడిపోయిన తెలుగు సంస్కృతినీ తెలుగు లలితకళల్నీ పునరుజ్జీవింప జేసి సమకాలీన సమాజానికనువుగా వాటిని మళ్ళించి ప్రజాజీవనంలో నూతనోత్తేజం కలిగించటం లక్ష్యంగా నెలకొల్పబడిన గాంధీక్షేత్ర సంస్థలలో దివిసీమ సాహితీ సమితి ఒకటి. ఈనాడు మా సాహితీ సమితి ప్రాచీనతను గౌరవించి దాని నుంచి నేర్చిన విజ్ఞాన వివేక బలంతో నవ యువకులలో నవ సాహితీ చైతన్యాన్ని కలిగించాలని ఆకాంక్షిస్తుంది. ఈ సంస్థలో ఉన్న కృష్ణరాయ గ్రంథాలయ సంస్థద్వారా నవయువ లోకానికి పఠనాశక్తి, పరిశీలనా కాంక్ష పరిజ్ఞానాభివృద్ధి కలిగించి యుక్తాయుక్త సారస్వత సమాలోచనం చేయించాలనీ దానికి సాహితీ సమితి దోహదకారి కావాలనీ మా ఆశయం. ఈ ఆశయాల సాధన కృషిలోనే దివి సీమకు కృష్ణాజిల్లా రచయితలను రప్పించి సాహితీ దిగ్గంతుల పర్యవేక్షణలో వివిధ సాహిత్య ప్రక్రియలలో ప్రత్యేక పరిశ్రమ సల్పి సాఫల్య మందుకొన్న పెద్దల సాహితీ వైభవాలను పండించదలచాం. మీ అందరి సహకారంతో కృష్ణాజిల్లా సాహితీ కీర్తి ధ్వజాన్ని మరొకసారి దివి సీమలో ఎగుర వేసే ప్రయత్నం జయప్రదం కాగలదని ఆశిస్తాను.



# కథా రచన - రవీంద్రుడు

జోశ్యుల భాస్కర్

కథను నడిపించటంలో మహా కవి రవీంద్రుని మించిన వారు లేరనిపిస్తుంది. ఆయన వ్రాసిన ప్రతి కథలోను ముగింపు మాత్రం అనుకోని విధంగా ఉంటుంది. కథ ముగింపు అవినీతితో నిండి ఉండదు. రవీంద్రుని కథలు కూడ సమాజానికి ప్రతిబింబాలే. కాని ఆయన దుష్టపాత్రలనెన్నడూ ఎన్నుకోలేదు. అసలు ఆయన కథలలో దుష్టులెవ్వరూ కనబడరు. చాల చిత్రమయిన రీతిలో ఆయన కథలను ఈ నాటి సమాజాని కన్వయించిచూస్తే ఈ రోజుల్లో జరుగుతున్నట్లే ఉంటాయి. రవీంద్రుని కథల్లో కనబడే ప్రేమ నిజమయిన ప్రేమ. అది మనస్సుని కదిలిస్తుంది. ఈ రోజుల్లో కూడ చాల రకాల కథలలో ప్రేమ సంఘటనలు కనబడతాయి. కాని ఇవి రవీంద్రుని కథలలోని ప్రేమ సన్నివేశాలలాగ కనిపించవు. అంటే ఈ నాటి కథల్లో ప్రేమ ప్రేమకాదని కాదు కాని ఆయన వర్ణించిన విధంగా వర్ణించటం ఈ నాటి రచయితలకు కుదరదా! అనిపిస్తుంది. ఈ రోజులలో నవలలు కథలు చదువుతూ ఉంటే భార్యను హింసిస్తున్న భర్తో, ప్రజల్ని పీడిస్తున్న నాయకుడో కనబడతారు ప్రస్తుత కాలపరిస్థితులను ప్రతిబింబించేవిగా ఉన్నాయను కొన్నా దయ్యాలున్నాయని లేవని చర్చలకు వేదికలుగా నవలలు వెలువడటం అన్యాయానికెక్కువ ప్రదర్శన, పరోక్షంగా ప్రచారంగా పనిచేస్తాయేమో అనిపిస్తుందిగాని రచనలు సమాజానికుపయోగపడతాయని తోచదు. ఏ పుస్తకమైనా చదివితే దాని వలన ఉపయోగముండాలి, దొంగతనం చేయుటమెట్లా! అని పుస్తకం వ్రాశారనుకోండి ఉపయోగమేమిటి? రచన చేస్తే పాఠకుల మనస్సులకాహ్లాదం కలిగించాలి. సమాజానికి మంచిని సూచించాలి. రవీంద్రుని కథలలాగ తెలుగులో కథలు రాకపోలేదు కాని ఈ మధ్య చాల తక్కువ. కథ అనేది హాస్యమయినా కరుణామయమైనా, ప్రేమపూరితమైనా మనస్సుకు ఆహ్లాదాన్నందించాలి. అది చదివాక పాఠకుడు తృప్తి చెందాలి. కథ చదువుతున్నంత సేపు ఆ కథలో లీనమయిపోవాలి, కథగాని నవలగాని పూర్తి చేసిన తరువాత కూడ ఆ కథా వస్తువు సమస్యలు పరిష్కారమైన తీరులు-అది మనకిస్తున్న సందేశం కొంత కాలమైనా మనస్సులో మెదులుతూ ఉండగలిగేలాగ రచన సాగితే దానికి ప్రత్యేకత ఉంటుంది అటువంటి కథ వ్రాసిన రచయితనే రచయిత అనాలి.

రవీంద్రనాథ్ టాగూరు వ్రాసిన "VISION" (చూపు) చదువుతూ ఉంటే ఎంతో ఆనందాన్ని పొందుతాం. రవీంద్రుడు కథనడిపే తీరు వేరు. ఈ కథ 1917 సం॥ లో

పూర్వం వ్రాసినా ఈ నాటి పరిస్థితులకు సరిపోతుంది. అది నిన్నో, నేడో జరిగిన సంగతిలా ఉంటుంది. అదినిజంగా గొప్పతనం.

అభినాష్ కలకత్తాలో మెడిసిన్ చదువుతూ వుంటాడు. ఇతని భార్య చాల చిన్న వయసులోనే ఒక మృత శిశువును కని (కాను) మృత్యువు నుండి తప్పుకోగల్గుతుంది. ఈ పరిస్థితులలో ఆమె కంటిచూపు బలహీన మవుతుంది. అభినాష్ ఆమెకంటికి వైద్యం చెయ్యటం మొదలు పెడతాడు. ఈ రోజుల్లోనే అభినాష్ బావమరది తన అక్క గారిని చూసిపోదామని వస్తాడు. తన అక్కకు వైద్యం చేస్తున్న బావగారిని చూసి మంచి కంటి డాక్టరుకి చూపించ రాదా అంటాడు. అతని దృష్టిలో అభినాష్ సంపూర్ణత నొందని వైద్యుడు. అభినాష్ కోపంలో మంచి డాక్టరు వచ్చి యింత కంటె ఏం చెయ్యగలడనీ, ఇది సాధారణమైన కేసని అంటూ అతని మాటలకు ప్రాముఖ్య మివ్వడు. వీరిద్దరూ వాదించుకొంటూ ఉండగా అభినాష్ భార్య "ఇద్దరు రాజులు యుద్ధం చేస్తూ ఉంటే మధ్యలో బాధ అనుభవించేది గడ్డి కదా!" అని బాధపడుతుంది. నిజంగా రవీంద్రుడీ మాటల ద్వారా కవి ఎంత బలం కలిగించాడో! తన భర్త, తమ్ముడు వాదించుకోవటంలో ఇద్దరి మీద ప్రేమ ఉన్న తనెలా బాధపడుతుందో కవి ఈ చిన్న ఉదాహరణతో చెప్పటం చాల బాగుంది.

ఇంక కొంతకాలం గడిచాక అభినాష్ ఒక డాక్టర్ని సంప్రదించగా అతని భార్యకు ఆపరేషన్ అవసరమని చెపుతాడు. ఇది భార్యతో చెప్పటానికి బాధపడతాడు-ఈ సందర్భంలో అభినాష్ భార్య చేత "Men are heroic only before their wives" అనిపిస్తాడు కవి. ఇంకొకచోట స్త్రీల మనస్తత్వాన్ని కూడ అద్వితీయంగా వివరించాడు, "తల్లులమై పిల్లల్ని సమాధాన పరచటాని కబద్ధమాడతాం. భార్యలుగా మా పిల్లల తండ్రులను శాంతపరచటాని కబద్ధమాడతాం. ఈ అవసరాల్ని తప్పించుకోలేం" అనిపిస్తాడు.

అభినాష్ భార్య కంటి చూపు పూర్తిగా నశిస్తుంది. కలకత్తా నుంచి ఒక పట్నానికి తిరిగివస్తాడు. అభినాష్ ఈ కొత్త పట్నంలో వైద్యం ప్రారంభిస్తాడు. రోజులు గడుస్తుండగా ఈ కుటుంబంలోకి అభినాష్ పినతల్లి ప్రవేశిస్తుంది. కల్లోలం రేపుతుంది. ఆవిడను పరిచయం చేస్తూనే రచయిత ఆవిడ మనస్తత్వాన్ని చెపుతాడు. ఆవిడ ఇంట్లోకి వస్తూనే అభినాష్ భార్యతో ఇలా అంటుంది. "అయ్యో కుమూ! (కుమూ, అవినాశ్ భార్య పేరు) నీవు గుడ్డిదానవవటం చాల దురదృష్టం. కాని నీ బాధని నీ భర్త మీదెందుకు రుద్దుతావు. అతని నింకో పెళ్ళి చేసుకోనియ్యి" అంటుంది. అసలు మామూలు స్త్రీగా ఇంకొక స్త్రీ బాధలో ఉన్నప్పుడు ఇల్లా మాట్లాడలేదు. కాని ఆమె వింత మనస్తత్వం కల ఆడది. కొంత దుష్ట స్వభావం ఆమెలో ఉన్నదని చెప్పటానికి ఆమె విశిష్టత నీ విధంగా మనకి తెలియ చేశాడన్నమాట. ఆమె చివరికి అవినాశ్ భార్యతో you must get him to marry another wife" అంటుంది. తన అన్న కూతురు "హేమాంగిని" ని అవినాశ్,కిచ్చి వివాహం చెయ్యాలనే ఉద్దేశం కడుపులో పెట్టుకొని అవినాశ్ పినతల్లి ఈ విధంగా మాట్లాడుతుంది.

రచయిత పరిచయంచేసిన మరొక మంచి పాత్ర ఈ హేమాంగిని. ఈమె చిన్నపిల్ల. ఈ హేమాంగినిని తనకి పరిచయం చేసినప్పుడు తాను గుడ్డిదవటం వల్ల అవినాశ్ భార్య ఆమె ముఖాన్ని శరీరాన్ని చేతితో తడిమి పరిశీలించి అందమైన పిల్లనీ 14, 15 ఏళ్ళ వయసుకి మించదని గ్రహిస్తుంది. ఈమె గుడ్డిదని గ్రహించని హేమాంగిని "ఏం చేస్తున్నావు' నన్ను "హిప్నటైజ్" చేస్తున్నావా!" అని అడుగుతుంది. అసలీ కథంతా రచయిత అవినాశ్ భార్య చేత చెప్పించాడు.

"నిన్ను చూడటానికి ప్రయత్నిస్తున్నాను" (పెద్దగా నవ్వి) "నేనెంత మృదువుగా ఉన్నానో నా చుట్టూ పరిశీలించి చూడటానికి నేనేమన్నా నీ తోటలో పెరిగిన కూరగాయ మొక్కనా!" ఆమెకు నేను గుడ్డిదానినని తెలియదని హఠాత్తుగా తెలుసుకుని "చెల్లీ నేను గ్రుడ్డిదానిని" అన్నాను.

ఈ మాట విని హేమాంగిని చాల బాధ పడుతుంది. ఇందుకనే అవినాశ్ తన అత్తగారిని ఆహ్వానించాడనీ, కాని తన తండ్రి తననిక్కడి కెందుకు పంపాడో అర్థం కాలేదని అనడంలో రచయిత మనకి ముందు కథలో ఏం జరగబోతోందో మనకి సూచించాడు.

ఈ హేమాంగిని చిన్నపిల్ల-మానసికంగా ఎదగనిమనిషి అంటే లోకం తెలియని పిల్ల మాత్రం కాదు. కాని మనసులోని మాటను దాచుకోలేదు ఒక రోజు ఈ హేమాంగిని అవినాశ్ భార్యని "నీకు పిల్లలెందుకు లేరు!" అని ప్రశ్నించగా అవినాశ్ భార్య "భగవంతుడు తన కీయలేదని" చెప్పగా "కాదు కాదు, నువ్వేదో పాపం చేశావు. మా అత్తయ్య చూడు గొడ్డురాలు. ఎందుకంటే, ఆమె మనసు దుష్టస్వభావంతో నిండి ఉంది" అంటుంది. ఈ మాటలు అవినాశ్ భార్యకు బాధ కలిగిస్తాయి. "ఓయి భగవంతుడా! కారణం నీకు తెలుసు" అనుకొంటుంది మనసులో ("My God thou Knouwest the reason) ఈమాటలు కవితా భాషలో రమణీయంగా ఉన్నాయి.

అత్తమాటల వల్ల హేమాంగినిని పెళ్ళాడటానికి నిశ్చయించుకొని ఒకరోజు (భార్యతో ఈ విషయం చెప్పడానికి భయపడి) పక్క గ్రామంలో ఒక రోగిని చూడటానికి వెడుతున్నానని రెండు మూడు రోజులు పడుతుందని చెపుతాడు, కాని నిజం గ్రహించిన భార్య రెండవ పెళ్ళి చేసుకో వద్దని ప్రార్థిస్తుంది. కాని అతను వెళ్ళిపోతాడు.

ఇంతవరకు కథ చదివిన పాఠకులు అవినాశ్ భార్య చనిపోతుందనో అవినాశ్ రెండవ వివాహం చేసుకొని వస్తాడనో ఆమె వచ్చి మొదటి భార్యను హింసిస్తుందనో లేక అన్యోన్యంగా ఉంటారనో అనుకొంటారు. కాని రచయిత ఈ కథ నిక్కడి నుంచి చాలా చిత్రంగా దారి మళ్లిస్తాడు. అవినాశ్ బావమరది హేమాంగినిని వివాహమాడి తన అక్కగారి ఆశీస్సులకోసం వస్తాడు. ఆ గ్రామానికి హేమాంగినిని వివాహమాడదామని వెళ్ళిన అవినాశ్ హేమాంగిని వివాహం దాదాతో (అవినాశ్ బావమరది) జరిగిపోయిందని విని ఆనందంతో తనమీద తనకే అసహ్యభావంతో తిరిగి వచ్చేస్తాడు. తన భార్యమీద తనకి

అపారమైన ప్రేమ ఉన్నాగాని తన పినతల్లి కారణంగా మళ్ళీ వివాహం చేసుకోవాలన్న భావం కలుగుతుంది దాని నుండి తప్పుకో గలిగానని ఆనందం పొందుతాడు. తిరిగి వచ్చి, భార్యను దేవతంటాడు. కాని తన భార్య తాను సాధారణ స్త్రీనే అంటుంది, ఇంతకు ముందు. ఇప్పుడుకూడ. తన భర్తను దైవంగానే భావిస్తుంది. అవినాశ్ ఇకనుండి తనని దేవుడిగా చూడవద్దని ప్రార్థిస్తాడు.

రచయితగా రవీంద్రుని ప్రతిభ ప్రతి కథలోనూ కనబడుతుంది. ఆయన నడిపే సంభాషణ తీరు వేరు. రవీంద్రుడు లోకం బాగా తెలిసి, తనకు తెలిసిన దానిని అతి మనోహరంగా మనకు చెప్పగలిగిన దివ్యశక్తి గల రచయిత. అందుకే ఆయన మహా రచయిత.

"హోం కమింగ్" "ది స్కెలెటన్", సుప్రింనైట్, "సుభా," "కాబూలీవాలా" మొదలైన ఎన్నో కథలు రవీంద్రుని గొప్పదనం, మంచితనం మంచి పాత్రలలో చూపిస్తూనే ఉన్నాయి. ఎన్ని శతాబ్దాలు గడిచినా రవీంద్రుని కథలు మరుగున పడవు. ఇటువంటి అమరగాథలందించిన ఈ మహా మనీషిని కనీసం అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. భారతీయ పాఠకుడిగా భారతీయ కవీంద్ర రవీంద్రునికి నా కృతజ్ఞతాంజలులు.



# సమాజ సేవకు ఆదర్శక్షేత్రం గాంధీక్షేత్రం

కావూరి వెంకటరామయ్య
అధ్యక్షులు, దివిసీమ సాహితీ సమితి

శాంత్యభ్యుదయాలతో భారతదేశంలో రామరాజ్యం స్థాపించాలని గాంధీజీ అభిలషించాడు. ఆకలితోనూ, పేదరికంతోనూ మరణించే వాడెవ్వడూ ఉండరాదనేది ఆయన ఆశయం. ప్రతిపౌరునికి ప్రాథమికమైన అవసరాలు తీరుతూ ఉంటే సరియైన శాంతి యేర్పడుతుందని ఆయన విశ్వసించాడు. సత్యాహింసల సహకారంతో సమసమాజ స్థాపన నిమిత్తం సేవాభావంతో జీవితాంతం శ్రమించాడు.

గాంధీజీ ఆచరించి ఉపదేశించిన ఆశయాలకూ, కార్యక్రమాలకూ ఆచరణ రూపం కల్పించాలనే సంకల్పంతో గాంధీజీ శతజయంతి సంవత్సరమైన 1969లో గాంధీక్షేత్ర నిర్మాణ మారంభమయింది. గాంధీక్షేత్రస్థాపనలో ప్రధానోద్దేశం-విద్యా సాంస్కృతిక సామాజిక రంగాలలో గాంధీజీ రూపొందించిన నిర్మాణ కార్యక్రమాల నమలుపరచటం ద్వారా సమసమాజ స్థాపనకు తోడ్పడటమే. శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఈ సంస్థకు సంస్థాపకులు. ఇంకా వేరువేరు కార్యక్రమాలతో సుమారు 15 సంస్థలున్నాయి. సర్వోదయ నాయకుడు గాంధీజీకి సన్నిహితుడైన శ్రీ ప్రభాకర్ జీ ఈ విభిన్న సంస్థల కార్యక్రమాలని సమన్వయ పరచేందుకు గాంధీక్షేత్ర సంఘాధ్యక్షులుగా వ్యవహరించారు.

## గాంధీ క్షేత్ర స్థాపన

1969లో దివిసీమ సాంఘిక సాంస్కృతిక సేవాసమితి గాంధీక్షేత్ర నిర్మాణం చేపట్టింది. క్షేత్రం శీఘ్రంగా అభివృద్ధి పథాన్నందుకొంది. ఇందులో పనిచేసే సంస్థలన్నింటికి భవనాలు నిర్మింపబడ్డాయి. అవి శ్రీ కోసూరి రత్తయ్య గ్రంథాలయ భవనం, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య కార్యాలయభవనం, శ్రీమతి తిరుమలశెట్టి సీతామహాలక్ష్మమ్మ మహిళామండలి భవనం. మచిలీపట్నం రోల్డుగోల్డు కవరింగ్ సంఘం కస్తూరి భవనం, శ్రీ కంఠంనేని వెంకటాద్రియుడు బ్లాకు, గణేశ్ మోడల్ హౌసు, గాంధీక్షేత్రం ఆరుబయలు రంగస్థలం, నవ్యమైన ఆకర్షణీయమైన రంగస్థలం. రంగస్థలానికి మధ్య గాంధీజీ కూర్చున్న విగ్రహం, రంగస్థలం ఎదుట పాలరాతి నిండు విగ్రహం ప్రేక్షకుల నాకర్షిస్తాయి.

# నిర్మాణ కార్యక్రమాలు

<u>హిందీ ప్రచారక విద్యాలయం</u> : గాంధీజీ నిర్మాణ కార్యక్రమాలలో జాతీయ భాషగా హిందీని బోధించటం ఒకటి. మహాత్మాగాంధీ స్థాపించిన దక్షిణభారత హిందీ ప్రచార సభ (మద్రాసు) వారి ఆధ్వర్యంలో హిందీ ప్రచారక విద్యాలయం నడపబడుతోంది. బి. ఇడి. వలెనే ట్రైనింగ్ కోర్సుతో మ్మిది నెలలు జరుగుతుంది. ఇప్పటికి మూడు బ్యాచిలు ఇక్కడ ట్రైనింగ్ పొంది ఉపాధ్యాయులుగా అర్హత పొందివెళ్ళారు. మూడవ బ్యాచిలో 52 మంది శిక్షణపొందారు. 40 మందితో నాల్గవ బ్యాచి ఇప్పుడు శిక్షణ పొందుతోంది. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల నుంచి విద్యార్థినీ విద్యార్థులు వచ్చి యీ తరగతులలో చేరి అధ్యయనం, శిక్షణ పొంది అర్హతనందుకొంటున్నారు. ప్రాథమిక, మధ్యమ స్థాయి నుంచి పైస్థాయి వరకు బాలబాలికలకు హిందీబోధించే హిందీ మహా విద్యాలయం కూడా ఇక్కడే ఒకటి నడుస్తోంది.

<u>అద్దకం కేంద్రం</u> :— గాంధీజీ స్వయంఉపాధి పథకం ద్వారా సామాజిక విప్లవాన్ని కాంక్షించారు. కేంద్రప్రభుత్వ చేతి వనులబోర్డు ఆధ్వర్యంలో ఇక్కడ అద్దకం కేంద్రం (ప్రింటింగ్ ఆండ్ డయింగ్ సెంటర్) నిర్వహింపబడుతోంది. ఇక్కడ 35 మంది స్త్రీలు ఈ పనిలో శిక్షణ పొందుతున్నారు. నెలకు ఒక్కొక్కరు రు. 75 చొప్పున స్టైఫండ్ పొందుతూ 1980 ఫిబ్రవరి నాటికి ఒకబ్యాచి పూర్తయి, జూలై 1 నుంచి రెండవ బ్యాచి శిక్షణ ప్రారంభమై యిప్పుడు నడుస్తోంది.

<u>టైలరింగ్ కేంద్రం</u> :— బాలబాలికలు, యువతులు కూడా టైలరింగ్‌లో శిక్షణ పొందుతున్నారు. గుజరాతు సద్గురు సేవా సంఘం వారు ఈ సంస్థకు 10 కుట్టుమిషన్లు సప్లయిచేశారు. ఈ కేంద్రం స్వయం ఉపాధి సౌకర్యాలను నిపుణతను సాధించటానికి సహకరిస్తుంది.

<u>స్త్రీ సంక్షేమము-సంక్షిప్త స్త్రీ విద్యా, వృత్తి విద్యా కేంద్రములు</u> :— దివిసీమ మహిళా సేవాసంఘం మహిళా సంక్షేమ కార్యక్రమాలు విద్యాలయాలు నిర్వహిస్తోంది. ఇందులో ఆంధ్రప్రదేశ్ (సోషల్ వెల్ ఫేర్ బోర్డు) సాంఘిక సంక్షేమ సంఘం వారి సహకారంతో వివిధ ఆర్థిక సాంఘిక కారణాలచేత విద్యాభ్యాసం నిలిపివేసి జీవనాధారం లేని యువతులకు ఉచిత భోజన వసతులు కల్పించి 10 వ క్లాసు పరీక్షకు హాజరు కాగలిగేలా తర్ఫీదు నిచ్చే రెండు సంవత్సరాల కోర్సు నడుపబడుతున్నది. ఒక్కొక్క బ్యాచిలో 20 మందికి పైగా ఉన్న రెండు బ్యాచిలు పబ్లిక్ పరీక్షకు ఈ సంస్థద్వారా పంపబడ్డాయి. మూడవ బ్యాచి ప్రారంభం కాబోతూ ఉంది. ఉచిత విద్య, ఉచిత భోజనంతో పాటు విద్యార్థినులిందులో నెలకు రు. 10 "పాకెట్ మనీ" పేరుతో పొందుతున్నారు. దీనితోపాటు 15 గురు విద్యార్థినులు

ఇదే పద్ధతుల్లో ఇంగ్లీషు టైప్ రైటింగ్ లో యువకులకు శిక్షణ ఇవ్వబడింది. మళ్ళీ ఇప్పుడో కర్యాచి ప్రారంభమయింది.

ఆశ్రమ పాఠశాల :— బెస్తవారు సాంఘికంగా ఆర్థికంగా వెనుకబడి ఉన్నారు. ఆర్థికంగా వెనుకబడి ఉన్న కారణంచేత వారు తమ పిల్లల్ని విద్యావంతుల్ని చేసుకోలేరు. ఇది గమనించి అప్పటి విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు మత్స్యకారుల పిల్లల విద్యాభివృద్ధి నిమిత్తం ఒక ఆశ్రమ పాఠశాలని స్థాపించారు. ప్రభుత్వం చేత నడుపబడే ఈ ఆశ్రమ పాఠశాలలో ఇప్పుడు 6 వ తరగతి నుండి 9 వ తరగతి వరకు 250 మంది కేవలం బెస్త వారి పిల్లలు విద్యాభ్యాసం పొందుతున్నారు. ఈ పాఠశాల ఉన్నత పాఠశాల స్థాయికి పెరిగింది.

కృష్ణరాయ గ్రంథాలయం :— తన స్వీయ గ్రంథాలతోనే శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారీ గ్రంథాలయాన్ని స్థాపించారు. పదివేలకు పైగా గ్రంథాలీ గ్రంథాలయంలో ఉన్నాయి విలువైన, అరుదైన ప్రత్యేక గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ఈ గ్రంథాలయం యొక్క ప్రత్యేకత.

ఉచిత వైద్యశాల :— గాంధీక్షేత్రంలో పేదప్రజల సహాయార్థం ఉచితవైద్యశాల ఒకటి స్థాపించబడి నడుపబడుతోంది.

చిత్రాలు, ఛాయాచిత్రాల ప్రదర్శన:— గాంధీజీ జీవితకాలానికి చెందిన సందేశాలు స్ఫురింప జేసి వివరించే ఫోటోలతో ఒక ప్రదర్శన కేంద్రం గాంధీక్షేత్రంలో ఉంది. దీనితో పాటు 1977లో సంభవించిన తుఫాను దృశ్యాలు ప్రత్యక్షంచేసే ఫోటోలు వర్ణచిత్రాలు కలిగిన ప్రదర్శనంకూడా కలిసి ఉంది.

సేవాశ్రమం ;— 6-10-1977 తేదీన శ్రీమతి నిర్మలారామదాస గాంధీ (గాంధీజీ కోడలు) సేవాశ్రమానికి ప్రారంభోత్సవం చేశారు. గాంధీజీ మనుమడు శ్రీ కనూగాంధీకూడా ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. శ్రీమతి మండలి ప్రభావతిదేవి దానం చేసిన స్థలంలో స్థాపింపబడిన ఈ సేవాశ్రమం పరిసరాల ప్రదేశంగా విస్తృతమై అభివృద్ధి చెందింది. ఇదలి భవనాలు శ్రీయుతులు జాన్ డేడ్, బండి శోభనాచలం బురుగు ఓంకార్ గారలం సహకారంతో వారివారిపేర్లతో నిర్మింపబడ్డాయి. అలాగే మార్వాడీ రిలీఫ్ కమిటీ వారి సహకారంతో మార్వాడీ భవనం ఏర్పడింది. "రూరల్ సరీ కల్చరల్ డెవలప్ మెంట్ సహకారంతో నిర్మాణ కార్యక్రమాలు కొనసాగుతున్నాయి

అనాథశరణాలయం :— ఆగస్టు 1977 లో 40 మంది అనాథ బాలబాలికలతో అనాథ శరణాలయం నెలకొల్పబడింది. తుఫాను మహావిపత్తులో దివిసీమలో 400 మంది బాల బాలికలు తల్లిదండ్రులని బంధువుల్ని కోల్పోయారు. సేవాశ్రమం వారినొక సంవత్సరం పోషించింది. ఇప్పటికీ 200 మంది ఉన్నారు. సోషల్ వెల్ఫేర్ ఫండ్ వల్ల 40 మందికి, ఎ. ఎమ్. జి. ద్వారా శ్రీ జాన్ డేవిడ్ గారి వల్ల 100 మందికి కొంత సహాయం లభిస్తోంది. మిగిలినవి విరాళాల ద్వారా ప్రోగుచేసిన దానితో నిర్వహించబడుతోంది. మామూలు విద్యతో పాటు వృత్తి సంబంధమైన విద్యకూడా వీరికి గరపబడుతోంది,

గాంధీ గురుకులం :— ప్రభాకర్ జీ ప్రోత్సాహంతో ప్రసిద్ధ గాంధేయ (బేసిక్) విద్యావేత్త శ్రీ కే. ఎస్. ఆచార్యులుగారి అధ్యక్షతన గాంధీ గురుకులమనే విద్యాసంస్థ అనాథ బాల బాలికల నిమిత్తం, పేరుపొందిన సేవాకార్యకర్త, మాజీ గవర్నరు అయిన శ్రీ మీర్ అక్బర్ అలీఖాన్ గారి చేత ప్రారంభోత్సవం చేయబడి సేవాశ్రమంలో నడపబడుతోంది.

తుఫాను భీభత్సం-రక్షణ పునర్నిర్మాణ కార్యక్రమాలు :—19-11-1977 నాటి తుఫాను జాతీయ విపత్తు. ప్రకృతి దివిసీమలో కలిగించిన భీభత్సం వర్ణింపరానిది కదా. పదివేల మనుష్యులు లక్షలాది పశువులు మరణించటం, కోట్లవిలువైన ఆస్తికి నష్టం, గ్రామాలే అదృశ్యమవటం జరిగాయి. ఆ నిస్సహాయస్థితిలో గాంధీక్షేత్రం బాధితుల నాదుకొని బాధ్యత వహించింది. శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు వెంటనే కార్యరంగంలో దూకి నిద్రాహారాలు అనారోగ్యం లెక్క చేయకుండా శవాలను తొలగించటం దగ్గర నుంచి వివిధ నిర్మాణ కార్యక్రమాల్లో నిమగ్నమై శ్రమించిన విషయం జగత్ప్రసిద్ధమైంది. గాంధీక్షేత్ర సేవాశ్రమాలు బాధితులైన మృతశేషులకు శరణాలయాలయ్యాయి. మొదటి వారంలో 15 వేలమందికి రెండవ వారంలో 10 వేలమందికి మూడవ వారంలో 5 వేలమందికి ప్రతిరోజు సేవాశ్రమంలో భోజనసౌకర్యాలు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ గాంధీక్షేత్రంలో ఏర్పరచిన రక్షణ శిబిరాలని రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి, అప్పటి ప్రధాని శ్రీ మొరార్జి దేశాయ్ శ్రీమతి ఇందిరాగాంధీ మొదలైన వారు సందర్శించి కార్యక్రమాలను ప్రశంసించారు. సహాయార్థం వచ్చిన స్వచ్ఛంద సేవా సంస్థల వారికి కూడా గాంధీక్షేత్రంలో నివాసములేర్పరుపబడ్డాయి. శ్రీ ప్రభాకర్ జీ మార్గదర్శకత్వంలో శ్రీ మండలి వారు శవసేవ నేర్పరచి గాంధీక్షేత్ర కార్యకర్తలందరితో కలిసి సాగించిన నిర్మాణ సేవా కార్యక్రమాల వివరణ చెయ్యటం, ప్రత్యేకమైన గ్రంథం వ్రాయటమే అవుతుంది.

తుఫాను బాధితుల రక్షణ-పునర్నిర్మాణ సంఘము :— అన్నివైపులనుంచి వచ్చిన వేరువేరు స్వచ్ఛంద సేవా సంస్థలన్నిటితో కూడి ఏర్పడిన ఒక సమన్వయ సంఘమే ఇది. శ్రీయుతులు

ప్రభాకర్ జీ, లవణం, రాజలింగం, జయసింహాచారి, రాగి, శ్రీమతి హేమలతా లవణంగారలు తదితరులు ఈ సందర్భంలో సమర్థవంతంగా పనిచేశారు. రెండు వందలమంది వితంతువులకు విధురులకు వివాహాలు గాంధీక్షేత్రంలో చెయ్యబడ్డాయి.

10-10-1978 నుండి గాంధీక్షేత్రంలో వివిధ స్వచ్ఛంద సేవాసంస్థల సమావేశం జరుపబడింది. తత్ఫలితంగా 'ఆంధ్రప్రదేశ్ స్వచ్ఛంద సంస్థల సంఘం సేవా కార్యకర్తల సంఘం' ఏర్పడింది.

## గాంధీక్షేత్రంలో పనిచేసే వివిధ సేవా సంస్థలు

గార్డు :— గాంధేయ సిద్ధాంతాను గుణంగా ఏకీకృత గ్రామీణాభివృద్ధి కార్యక్రమాల నమలు పరచటం నిమిత్తం శ్రీ ప్రభాకర్ జీ మార్గదర్శకత్వంలో గార్డు (గాంధియన్ యునైటెడ్ యాక్షన్ ఫర్ రూరల్ డెవలప్‌మెంట్) అనే సంస్థ స్థాపింపబడింది. సుప్రసిద్ధ గాంధేయవాది శ్రీ ప్రభాకర్ జీ అధ్యక్షులుగా, శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు కార్యకరణాధ్యక్షులుగా శ్రీ జయసింహాచారి కార్యదర్శిగా ఈ సంస్థ రూపొందింది.

ఒక మోడల్ మిక్స్‌డ్ ఫారమ్ (అగ్రికల్చర్, డెయిరీ, పౌల్ట్రీ), సెరికల్చర్ కార్యక్రమాలతో కూడినది) గ్రామీణ యువకులకు శిక్షణ కేంద్రంగా పనికి వచ్చేటట్లు ఇందులో ఉన్న అనాధ బాలబాలికలకు దీనిద్వారా నైపుణ్యం కలిగించటానికి, స్వయం ఉపాధి సావకాశం కల్పించటానికి వీలుగా క్రిస్టియన్ ఎయిడ్ 'లండన్' వారి ఆర్థిక సహాయంతో స్థాపింపబడింది. గ్రామీణ పరిశ్రమలు కూడా స్థాపించి గ్రామీణ యువకులకు శిక్షణ కేంద్రంగా సేవాశ్రమాన్ని రూపొందించాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ప్రభాకర్ జీ దీనజన ఫౌండేషన్ ;— గాంధీక్షేత్ర సేవాశ్రమ సంఘాల అధ్యక్షులుగా శ్రీ ప్రభాకర్ జీ తుఫాను తాకిడి తిన్న ప్రాంతాలు పర్యటించి 18-6-1978 వ తేదీ వడదెబ్బ తగిలి దివంగతులయ్యారు. ఆయన కృష్ణాతీరాన గల ఈ సేవాశ్రమంలో ఉండి తాను తలబెట్టిన కార్యక్రమాలు నిర్వహించాలని "సంఘసేవ-గ్రామీణాభివృద్ధి" అనే విషయంమీద సెమినారు నడపాలని భావించారు. ప్రతిసంవత్సరం ప్రభాకర్ జీ స్మారక కేంద్రాలు నడపాలనే ఉద్దేశంతో ప్రభాకర్ జీ దీనజన ఫౌండేషన్ స్థాపింపబడింది. మాజీ గవర్నర్ శ్రీ మీర్ అక్బర్ అలీఖాన్ ఛైర్మన్‌గాను, శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు ఎగ్జిక్యూటివ్ ప్రెసిడెంటుగాను ఫౌండేషన్ ఏర్పడింది.

గాంధేయ సమాజసేవా సంస్థ :— గాంధీజీ సిద్ధాంతం యువతరంలో వ్యాపింప చెయ్యాలనే సంకల్పంతో ఈ సంస్థ స్థాపింపబడింది. దీని ఆధ్వర్యంలో రెండు శిక్షణ శిబిరాలు, ఒక ఆంధ్రప్రదేశ్ నిర్మాణ కార్యకర్తల సమావేశము నిర్వహింప బడ్డాయి. ఈ సంస్థ గాంధేయ నిర్మాణ కార్యక్రమాలను గురించి ఇంగ్లీషులో ఒక పుస్తకం ప్రచురించింది.

దివిసీమ సాంస్కృతిక సాంఘిక సేవా సంస్థ:— ఈ సంస్థ గాంధీక్షేత్ర నిర్మాణం చేపట్టింది. అనేక సాంస్కృతిక కార్యక్రమాలు అమలు పరుస్తోంది.

దివిసీమ లలిత కళా సమితి :— ఈ సమితి ఉత్సాహంతో జానపదకళలను ప్రోత్సహిస్తోంది. సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. రాష్ట్రస్థాయి నాటక పోటీలు నిర్వహించి రాష్ట్ర నాటకోత్సవాలు దిగ్విజయంగా జరిపింది

దివిసీమ మహిళా సేవా సంఘం :— స్త్రీ సంక్షేమ కార్యక్రమాల నిమిత్త మేర్పరచిన సంస్థ. మహిళా కో-ఆపరేటివ్ ఫైనాన్స్ కార్పొరేషన్ వారి సహాయంతో ఈ సంస్థ చాలా పాడి పశువులు, కుట్టుమిషన్లు స్వయం ఉపాధి పథకాల క్రింద సప్లయి చేసింది. స్త్రీ విద్యా సంస్థలు నడుపుతోంది.

దివిసీమ బాలానంద సంఘం :— బాలబాలికలలో నిర్మాణాత్మక శక్తిని పెంపొందించే ప్రయత్నం గలిగిన సంస్థ. ఈ సంఘానికి చెందిన బాల బాలికలు ఆంధ్రప్రదేశ్ బాలల సమావేశంలోను అఖిల భారత బాలల సమావేశంలోను కూడా ప్రదర్శనాలిచ్చి తమ నైపుణ్యం చూపించారు. ఆ సమావేశాలలో పోటీల బహుమతు లందుకొన్నారు. రేడియో. టి. వి. కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు. బాలలలో సాహితీశక్తిని పెంపొందించే ప్రోత్సాహంతో "గోరంత దీపం" అనే చిన్న బాలగేయ సంపుటిని కూడా ఈ సంఘం ప్రచురించింది. తద్దేయు కారులు శ్రీ కోసూరి పున్నయ్య భాగవతార్.

దివిసీమ వయోజన విద్యాసమితి : వయోజనులలో విద్యాభివృద్ధి కలిగించేందుకు కృషిచేసే ఈ సంస్థ ఎ. ఎమ్. జి. ఇంటర్నేషనల్, చిలకలూరిపేటవారి ఆర్థిక సహకారంతో దివిసీమ లోని తోట్టు గ్రామాలలో 70 వయోజన విద్యాకేంద్రాలు నడుపుతోంది.

దివిసీమ సాహితీ సమితి : ప్రజలలో సాహిత్యాభి రుచి పెంపొందించాలనే సంకల్పంతో ఈ సంస్థ స్థాపించబడింది. తరచు కవిసమ్మేళనాలు, సాహితీ సభలు నిర్వహిస్తోంది. ఈ సంస్థ నిర్వహించిన సభలలో ప్రసిద్ధ కవి. పండితులు పాల్గొన్నారు. ఈ సంస్థ 'ఉప్పెన తుఫాను ఉదంతాల' నే గ్రంథం ప్రచురించింది. ఆ విపత్తు దేశవాసులకు కళ్ళకు కట్టినట్లుగా చేసింది.

దివిసీమ దీనజన సంక్షేమ సమితి : ఇది బలహీన వర్గాలవారి సంక్షేమ కార్యక్రమాల నిర్వహణకై ఉద్దేశింపబడింది. దీని ఆధ్వర్యంలో సేవాశ్రమంలో 160 మంది అనాథ బాలిక లతో ఒక అనాథ శరణాలయం నడపబడుతున్నది. త్వరలోనే ఈ సంస్థ వయోవృద్ధులైనవారి సంక్షేమార్థం ఒక కేంద్రం నిర్వహించాలనే తలంపుతో ఉంది. సుప్రసిద్ధ రచయిత సంఘ కార్యకర్త శ్రీ ముక్కామల నాగభూషణంగారు దీనికి ఛైర్మన్‌గా ఉంటున్నారు. గాంధీజీని మరచిపోయిన ఈరోజులలో గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలుజరుపుతున్న ఏకైక క్షేత్రం. దేశం ఎదుర్కొంటున్న రాజకీయ, ఆర్థిక, సామాజిక క్లిష్ట పరిస్థితులలో గాంధీ క్షేత్రం మార్గదర్శకం కాగలదని ఆశిద్దాం.

57

# అనుభూతి - అవగాహన

## కృష్ణాజిల్లా తెలుగు రచయితల 6 వ మహాసభల నిర్వహణపై అభిప్రాయాలు

ఈ సభలు సారస్వత ప్రక్రియల్లో నూతన ఉత్సాహం, హృద్వేగం కలిగించాయి.

—ఎం. ఆర్. అప్పారావు

మీ అందరి కృషివల్ల, సభల్లో పాల్గొన్న వక్తల, శ్రోతల సహకారంవల్ల అవనిగడ్డలో సాహితీ సభలు బాగా జరిగినందుకు అభినందనలు. రాజకీయ సభలు జరగటం వేరు, సాహితీ సభలు జరగటం వేరు. సాహితీ సభకు హాజరయే జనులు తక్కువ వుంటారు. అయినప్పటికీ, మీ తావున జరిగిన సాహితీ సభలు పెద్దఎత్తున జరిగి నందుకు ఆనందం.

— సంజీవదేవ్

సభలు నిర్వహించిన తీరు, ఆతిధ్యమిచ్చిన విధానమూ, ఏ విధమైన అసంతృప్తి, అపశ్రుతి లేకుండా, సభ్యు లందర్నీ సంతోషపెట్టిన రీతీ, అక్కడకు వచ్చిన అందరికీ చిరస్మరణీయమైన ముద్రగా మిగిలిపోగలవు.

—అద్దేపల్లి రామమోహనరావు

ఇలాంటి సభలు మహానగరాల్లో కన్నా ఓ మోస్తరు గ్రామాల్లో జరపడమే అవసరం. సాహితీ పరులెలాగూ నగరాల నుంచే వస్తారు. గ్రామీణ చైతన్యానికి సాహిత్యంకన్నా బలమైనసాధనంకనిపించదు. ఈ దృష్టితోచూస్తే మీది నూతన ప్రయోగం. కృష్ణాజిల్లా తతిమ్మా గ్రామాల్లో కూడా ఇలాంటి క్షేత్రాలూ, ఆ క్షేత్ర నిర్మాతలైన కార్యకర్తలూ ఆవిర్భవించడానికి ఈ సభలు ప్రేరణ కావాలి. కనిపించని విద్యుత్తులా ఎన్నో దీపాలను వెలిగించిన మండలి వారికి కృతజ్ఞతాభివాదాలు. కార్యకర్తలకు. పేరున్నవారికీ పేరులేనివారికి కూడఅభినందనలు

— మిరియాల రామకృష్ణ

అక్కడవున్న రెండురోజులూ-మరువలేని మంచిరోజులు.

— ఇంద్రగంటి జానకీబాల

కృష్ణాజిల్లా రచయితల సభలు-గాంధీ క్షేత్రంలో చాలా చక్కగా జరిగాయి. గాంధీక్షేత్రదర్శనం ఒక మధురానుభూతి. గౌ॥ మండలి వారి సేవాదృష్టికీ, కార్య దక్షతకీ ప్రతీక.

—విహారి

# "మందారమాల-అందాల బాల"

మండల రామారావు

ఏదైనా గేయం వ్రాయమని
మిత్రుడు ప్రోత్సహించడం
ఏది వ్రాయాలా యని
మనసు సంకోచించడం
వేమన గూర్చి వ్రాయడమా
పోతన గూర్చి వ్రాయడమా
అని ఆలోచించడం

ఉవ్వెత్తున పొంగి ఉప్పొంగిన
ఉప్పెన గుర్తుకు రావడం
తల్లులు పోయి, తండ్రులు పోయి
తల్లడిల్లి పోయిన పిల్లలు
జ్ఞప్తికి రావడం

ఎల్ల వేళలా
అన్ని వేళలా
వారిని సంరక్షించే
కళకళ లాడుతూండే
జీవకళ ఉట్టి పడుతూండే
సుక్షేత్రమైన
గాంధి క్షేత్రాన్ని గూర్చి వ్రాయడం
న్యాయం అనిపించడం

ఇక్కడ జరుగుతున్న ఎన్నో కార్యక్రమాలు
ఇక్కడ జరుపుతున్న ఎన్నో కార్యకలాపాలు
నా మదిలో మెదలడం
నా హృదిలో కదలడం

టీచరు ట్రైనింగు
హిందీ బోధన
కండెన్సుడు కోర్సు
నాటకోత్సవాలు
భరతనాట్యాలు
కవి సమ్మేళనాలు
ఆటల పోటీలు
పాటలలో పోటీలు
చిత్రలేఖనలు
చిత్ర వేషములు
పాడి పశువులు పెంపకాలు
కోళ్ళ పెంపకాలు
కుట్టుపనులు నేర్పడాలు
స్త్రీ సంక్షేమ పథకాలు

ఒకటా, రెండా, మూడా
లెఖ్ఖకు మించిన ఎన్నో
ఎన్నెన్నో కార్యక్రమాలు
వచ్చినవారు, చూచినవారు
ఆశ్చర్యం పొందడం
ఆనందం చెందడం
ఆశీర్వదించడం
వాటిని గూర్చి వ్రాయడం కాక మరి
వేటినిగూర్చి వ్రాయడం!
ఈ పైవన్నీ ఒక ఎత్తు
ఇప్పుడు జరుగుతున్న
జిల్లా రచయితల మహాసభలు
మరొక ఎత్తు

తెలుగు వెలుగును
దశదిశలను చాటే
కవులు, కవయిత్రులు
రచయితలు, రచయిత్రులు
అతిరథులు, మహారథులు
విచ్చేస్తున్న ఈ సభలు
ప్రపంచ తెలుగు మహాసభ
లను స్ఫూ[illegible]కు తెస్తున్నవి.

* * *

భువిలో 'దివి' లాంటి
'దివి'గడ్డ అందమైన
ఈ అవనిగడ్డ
అందున గాంధీ క్షేత్రం
ఒక మందార మాల
అందున్న గాంధి వేదిక
ఒక అందాల బాల.
ఆ అందాల బాలను ఆక్రమించిన
ఆ చందాల బాలను ఆవహించిన
ఆంధ్ర దేశపు తెలుగుబిడ్డలారా
అవనిగడ్డకు ముద్దుబిడ్డలారా
అందుకోండి నా నమస్కృతిని.
ఆదుకోండి మన సంస్కృతిని.

* * *



దుర్గాగణపేశ్వర ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతిసంఘము No. H. 220
తలగడదీవి, దివితాలూకా, కృష్ణాజిల్లా

| | | |
|---|---|---|
| సంఘము ప్రారంభించినది | రు. | 5-12-1919 |
| మెంబర్ల సంఖ్య | రు. | 366 |
| షేరు ధనము | రు. | 37,231 |
| అప్పు మొత్తము | రు. | 3,25,081 |
| సెంట్రల్ బ్యాంకు అప్పు | రు. | 3,16,818 |
| డిపాజిట్లు | రు. | 2,183-29 |
| రిజర్వుఫండు | రు. | 2,420-74 |

పాలకవర్గము

| | |
|---|---|
| మండలి వెంకట సుబ్రహ్మణ్యజితేంద్రకుమార్ | ప్రెసిడెంటు |
| పేర్ల వెంకటప్పయ్య | వైస్ ప్రెసిడెంటు |
| పీర్ల భుజంగరావు | డైరక్టరు |
| కనగాల రాజరత్నం | ,, |
| యర్రాప్రు వెంకటేశ్వరరావు | ,, |
| బొండాద కోటేశ్వరరావు | ,, |
| వర్రె గోపాల కృష్ణయ్య | ,, |
| ముమ్మారెడ్డి కృష్ణమూర్తి | ,, |
| చిన్నాబత్తుని నరసింహం | ,, |
| భోగాది ఇల్లి బసవయ్య | ,, |
| వల్లూటి పోతరాజు | ,, |
| బండ్రెడ్డి కృష్ణమోహన్ | సెక్రటరీ |



# అసలు రహస్యం

అనగా అనగా బాలు, చంద్రిక అనే బాలనేస్తాలు ఉన్నారు. వాళ్ళిద్దరూ చదువులో ఫస్టు. ఆటపాటలలో ఫస్టు. విజ్ఞాన విషయాలలో దేశదేశాల గురించిన విషయ పరిజ్ఞానంలోనూ వాళ్ళది ముందడుగే. పిల్లలకు సంబంధించిన ఎలాంటి వార్తలు అడిగినా వెంటనే చెప్పేస్తారు. స్టాంపుల సేకరణ వాళ్ళకి ఇష్టమైన సరదా. ఎవరికీ తెలియని వింతవింత సంగతులు వాళ్ళకి తెలుస్తాయి. అంతేకాదు. వాళ్ళు చిన్నచిన్న కథలు, గేయాలు కూడా రాయగలరు.

బాలు, చంద్రికల తెలివితేటలు అందరినీ ఆశ్చర్యపరిచాయి. "వాళ్ళు ఎవరిదగ్గరా ప్రైవేటు చదవటం లేదు. ఇన్ని విషయాలు నేర్పేందుకు వాళ్ళకి చదువుకున్న పెద్దవాళ్ళు ఎవరూ లేరు. మరి వాళ్ళు ఎలా అంత విజ్ఞానాన్ని సంపాదించారు?" అని మిగతా పిల్లలంతా ఆలోచనలో పడ్డారు. పరిశోధనలు చేశారు. అంతుబట్టలేదు. ఇకలాభంలేదని పిల్లలంతా కలిసి ఒక రోజు బాలు, చంద్రికలను నిలదీసి ఆ సంగతి అడిగేశారు. వాళ్ళిద్దరూ చిన్నగా నవ్వారు.

"మేము ప్రతినెల పిల్లల పత్రిక 'బాలచంద్రిక' చదువుతున్నాము. అందులో రంగురంగుల బొమ్మల కథలేకాక విజ్ఞాన సంబంధమైన ఎన్నో శీర్షికలు ఉన్నాయి. ఎనిమిది పేజీల 'విజ్ఞాన చంద్రిక' లో ఎన్నో సైన్సు కబుర్లు ఉంటాయి. 'బాల సమాచారం' అని పిల్లల వార్తాపత్రిక అందులోనే ఇస్తారు. మనలాంటి పిల్లలు రచనలు చేస్తే 'మీ కోసం ప్రత్యేకం' 'శీర్షిక కూడా ఉంది. ఇంకా బాల ప్రపంచం, వికాసతరంగాలు, సరదాలు, జోక్స్, కార్టూన్లు ఇంకా ఎన్నో ఆసక్తి కలిగించే రచనలు ఉన్నాయి. బాల చంద్రిక ప్రతినెలా చదివితే బాలల విజ్ఞాన సర్వస్వం చదివినట్లే ఉంటుంది. మాలో ఇంత పరిజ్ఞానానికి బాలచంద్రికే కారణం"... అని చెప్పారు బాలు, చంద్రిక.

పిల్లలంతా ఆశ్చర్యపడ్డారు. అయితే మేమూ ప్రతినెలా "బాలచంద్రిక" తప్పక చదువుతాం. ఈ రోజే ఏడాది చందా పదిహేను రూపాయలు పంపుతాం, అంటూ వారివారి తల్లిదండ్రుల దగ్గరికి పరుగెత్తారు. రాష్ట్రంలోని 40 వేల పాఠశాలలకు ప్రతినెల అందుతున్న ఏకైక పిల్లల పత్రిక.

**బాలచంద్రిక**

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమీ ప్రచురణ

'బాలచంద్రిక' 34/4 ఆర్. టి. బర్కత్‌పురా

**హైదరాబాదు - 500 027.**

# కృష్ణాజిల్లా రచయితల మహాసభలు - సమీక్ష

లలిత కళలకు నెలవై సాహితీ స్రష్టలను ద్రష్టలను సృష్టించిన దివిసీమకు నడిబొడ్డయిన అవనిగడ్డలో వెలసిన సమాజసేవాక్షేత్రం గాంధీక్షేత్రంలో కృష్ణాజిల్లా తెలుగు రచయితల అయిదవ మహాసభలు 1982 జూలై 10, 11 తేదీలలో దివిసీమ సాహితీ సమితి ఆధ్వర్యంలో విజయవంతంగా జరిగాయి.

10 వ తేదీ ఉదయం పదిగంటలకు మహాసభలు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' ప్రార్థనా గీతంతో ఉత్సాహపూరిత వాతావరణంలో ప్రారంభమైనాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి డాక్టర్ దాశరధి కృష్ణమాచార్యులు సభలను ప్రారంభిస్తూ "సంఘం శిశువు వంటిది. రచయిత సంఘానికి మాతృమూర్తి" అని పేర్కొన్నారు. శిశువు ఆరోగ్యంగా ఉండాలంటే ఆరోగ్యకరమైన తల్లిపాలు అవసరమైనట్లే సమాజ ఆరోగ్యానికి మంచి రచనలు కావాలన్నారు. సమాజాన్ని ఛిన్నాభిన్నంచేసే రచనలకు రచయితలు పూనుకోకూడదని హితవు చెప్పారు. "రాజకీయంగా ఎవరి అభిప్రాయాలు వారివి. అయినా సమాజ శ్రేయస్సే అందరి ధ్యేయం కావాలి. సమాజ పురోగతికి తోడ్పడే రచనలు చేయాలని" శ్రీ దాశరధి విజ్ఞప్తి చేశారు. భాషను గురించి ప్రస్తావిస్తూ భాష ప్రజలపై ఆధారపడి ఉంది, కాని పండితులపై కాదని, కార్మికులు, కర్షకులు మాట్లాడేది సిసలైన భాష అన్నారు. రచయితల ఆర్థిక దుస్థితిని ఆసరాగా తీసికొని పబ్లిషర్లు బాగుపడుతున్నారని అందుచేత రచయితల సహకార సంఘం ఏర్పాటు చేసుకొని పుస్తక ప్రచురణకు పూనుకోవాలని శ్రీ దాశరధి సూచించారు.




మహాసభలను ప్రారంభిస్తున్న శ్రీ దాశరధి

మహాసభల కార్యదర్శి శ్రీ బూదరాజు శ్యామసుందర్ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ మహాసభలు విజయవంతం కావాలని ఆకాంక్షిస్తూ పంపిన సందేశాన్ని చదివి వినిపించారు. "యువరచయితలను సమీకరించి జాతికి స్పందన కలిగించే ఉత్తమ సాహిత్యాన్ని వారు ఇతోధికంగా అందించేందుకు తగిన ప్రోత్సాహం సభల వల్ల తప్పక లభించగలదని ఆశిస్తున్నానని, సమాజ సేవాక్షేత్రంగా ప్రఖ్యాతినొందిన గాంధీక్షేత్రం సాహిత్య క్షేత్రంగా కూడా అన్ని విధాలా విజయవంతం కావాలని ఆకాంక్షిస్తున్నానని" తమ సందేశంలో పేర్కొన్నారు ముఖ్యమంత్రి.

ఈ సందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచికను శ్రీ ముక్కామల నాగభూషణం ఆవిష్కరించారు. ఆయన తమ ప్రసంగంలో సుదీర్ఘ చరిత్ర కలిగిన దివిసీమలో ఈ మహాసభలు జరుగుట ముదావహమని, దివిసీమ పూర్వపు ఔన్నత్యాన్ని పునరుద్ధరించడానికి ఎనలేని కృషిచేస్తున్న గాంధీక్షేత్రంలో ఈ సభలు నిర్వహించుట ఆనందదాయకమని అన్నారు. అజ్ఞాత వ్యక్తుల ఉదాత్త రచనలు ఎన్నో కాలగర్భంలో కలిసిపోతున్నాయని వాటిని వెలుగులోకి తీసుకురావడానికి కృషి జరగాలని శ్రీ ముక్కామల సూచించారు.




సావెనీర్‌ను ఆవిష్కరిస్తున్న శ్రీ ముక్కామల నాగభూషణం, సభాధ్యక్షులు శ్రీ సంజీవదేవ్

సభకు అధ్యక్షత వహించిన సుప్రసిద్ధ కళా విమర్శకులు శ్రీ సంజీవదేవ్ తమ ప్రసంగంలో సామాజిక శ్రేయస్సు-రసానందం-ఈ రెంటినీ రచయిత దృష్టిలో ఉంచుకోవాలని

అన్నారు. లలితకళలలో సాహిత్యకళ ఉత్తమమైనది. సంస్కారం లేకపోతే రాజకీయ సాంఘికాది రంగాలు కలుషితమవుతాయని, సమాజంలో సంస్కారం పెంచే విధంగా రచనలు రావాలని ఆయన కోరారు.

ఈ కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న కెనడా దేశ సమాజసేవకుడు శ్రీ రోబర్ట్ కేన్ వచ్చీరాని కమ్మని తెనుగులో ప్రసంగించి సభికులను ఆనందపరిచారు.

తొలుత ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు స్వాగతం చెప్పుతూ దివిసీమ విశిష్టతను, గాంధీక్షేత్ర సేవాకార్యక్రమాలను వివరించారు. సమాజ శ్రేయస్సుకు ఉపకరించే రచనలు చేయాలని ఆయన రచయితలను కోరారు.

సారథ్య సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు వందన సమర్పణతో ప్రారంభ సభ ముగిసింది.

* * * *

మహాసభల సందర్భంగా ప్రముఖ చిత్రకారుడు శ్రీ టి. సాయికృష్ణ ఏర్పాటు చేసిన "గీతగోవిందం" చిత్రప్రదర్శనను, డా॥ జి. వి. పూర్ణచంద్, శ్రీ ఎమ్. ఏ. మూర్తి, శ్రీ కె. హెచ్. రంగారావు ప్రభృతులు ఏర్పాటుచేసిన మినీ కవితా, మినీ కథా ప్రదర్శనలు శ్రీ సంజీవ్ దేవ్ ప్రారంభించారు. మైక్రో ఆర్టిస్టు శ్రీ గేదెల అప్పారావు ఏర్పర్చిన సూక్ష్మ చిత్రకళ ప్రదర్శన పలువురిని ఆకర్షించింది.

* * * *

## సాంప్రదాయక సాహిత్య సదస్సు

మధ్యాహ్నం 12 గం॥ లకు కవిసమ్రాట్ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి అధ్యక్షతన సంప్రదాయ సాహిత్య సదస్సు జరిగింది. నిర్దుష్టమైన సంప్రదాయ సాహిత్యం సుస్థిరంగా వుంటుందని, ఎన్ని రకాల రచనలు వచ్చినా ఇది నిలుస్తుందని శ్రీ పైడిపాటి అన్నారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ కోట సుందరరామశర్మ తమ ప్రసంగంలో "ప్రపంచంలోని ఇతర సాహిత్యములలో వలెనే తెలుగులో కూడా ఆదికాలంనుండి ఆధునిక యుగంవరకు సంప్రదాయ కవిత్వం అవిచ్ఛిన్నంగా సాగుతునే ఉంది. వినేవారూ, చదివేవారూ ఉండటమే సంప్రదాయ సాహిత్యం జీవించి ఉన్నదనడానికి నిదర్శనమని" అన్నారు.

ప్రబంధ కవిత్వం—శృంగార రసపోషణ అను అంశం పై శ్రీమతి సి. వేదవతి, అవధాన ప్రక్రియ—ప్రస్తుత పరిస్థితి గురించి డా॥ కంభంపాటి రామగోపాల కృష్ణమూర్తి, పోతన భాగవతం గురించి శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి, పోతన భక్తితత్వంపై కుమారి ఎస్. శ్రీ లక్ష్మీదేవి ప్రసంగించారు.

## బాల సాహిత్య సదస్సు

సాయంత్రం 6 గంటలకు బాలసాహిత్య సదస్సు బాలబంధు శ్రీ బి.వి. నరసింహారావు గారి అధ్యక్షతన జరిగింది. ముఖ్య అతిథిగ ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ విచ్చేసి తమ అకాడమిద్వారా బాలసాహిత్యాభివృద్ధికి జరుపుతున్న కృషిని వివరించారు.

బాల సాహిత్యం-కథలు - నాటికల గురించి శ్రీ సోమంచిరామం, శ్రీమతి డి. సుజాత దేవి బాల సాహిత్య ఆవశ్యకత గురించి, శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం బాలకేరస్థులు-రచయితల బాధ్యతపై సోదాహరణంగా ప్రసంగించారు.

## కథా సమ్మేళనం

రాత్రి గం. 7-30 లకు ప్రసిద్ధ రచయిత్రి, కళాప్రపూర్ణ శ్రీమతి తెన్నేటి హేమలత అధ్యక్షతన కథా సమ్మేళనం జరిగింది. శ్రీమతి లత తమ ప్రసంగంలో కథాసాహిత్యం అనాదికాలంనుండి వుందని, శాతవాహనుల కాలంలో వెలువడ్డ శాలివాహన గాథాసప్తశతి అందుకు నిదర్శనమని పేర్కొంటూ, ఇది నవలల కాలమని, కథారచయిత బ్రతకడం కష్టంగా వుందని, ప్రచురణ కర్తలు కథాసంకలనాలు ప్రచురించడానికి ముందుకు రావడం లేదని, రచయిత స్వయంగ ప్రచురించుకునే స్థితిలో లేడని ప్రస్తుత పరిస్థితులలో కథానికకు భవిష్యత్తు వున్నదా! అని తాను సందేహపడుతున్నానని శ్రీమతి లత అన్నారు.

కథా సమ్మేళనానికి అధ్యక్షత వహించిన డాక్టర్ లత

డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లు "చేదునిజం" కథను, శ్రీమతి వక్కలంక పద్మావతి "సిరులు పొంగిన జీవగడ్డ", శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల "ఘోష", శ్రీ వల్లాది సూరిబాబు

"జగత్సాక్షి", శ్రీ వి. వనకుశాలరావు "చరిత్ర", శ్రీ ఎమ్. వి. మూర్తి "స్వింగ్" కథానికలను చదివి వినిపించారు. శ్రీమతి కె. వసుంధరాదేవి మినీకథాస్వరూపాన్ని సోదాహరణంగా వివరించారు.

సదస్సులు ముగిసిన తరువాత రాత్రి గం. 9-00 లకు శ్రీ రాఘవ ఆర్టుథియేటర్సు (అవనిగడ్డ) వారిచే "ఓ సుమతి కథ" నాటకం ప్రదర్శింపబడింది.

## కవితా సదస్సు

11 వ తేదీ గం. 9-00 లకు కవితా సదస్సుతో రెండవరోజు కార్యక్రమాలు ప్రారంభమైనాయి. డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు సదస్సుకు అధ్యక్షత వహిస్తూ ఉదాత్త భావాలు గల కవి ఉదాత్త కవిత్వం వ్రాస్తాడని. కవిత్వం సభ్యతా సంప్రదాయాల నుంచి పరిణామం చెందుతూ వచ్చిందని తెలిపారు.

'కవిత్వం నిబద్ధత–అనుభూతి' అనే అంశంపై ప్రసంగిస్తూ శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, అనుభూతిలేని నిబద్ధత చదివించదని, నిబద్ధతలేని అనుభూతి సమాజానికి ఉపయోగపడదని, అన్నారు.

శ్రీ టి. ఎల్. కాంతారావు ఆధునిక కవితోద్యమాలను గురించి వివరించారు. కళాత్మకమైన విలువలులేని రచన వివాదంగ మిగిలిపోతుందనీ, ఆధునికత కాలవాది కాదు, గుణవాది అని అన్నారు.

శ్రీ మైత్రేయ నాటకరచనా పరిణామ క్రమం గురించి సోదాహరణంగా ప్రసంగించారు. శ్రీ రావి రంగారావు మినీ కవితగురించి, శ్రీమతి కె. నిశ్చల ఈ తరం కవులపై శ్రీశ్రీ ప్రభావం గురించి ప్రసంగించారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన డాక్టర్ మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వం పై తాము జరిపిన పరిశోధన విశేషాలను వివరించారు.

## తిరుపతి వెంకట కవుల సాహితీ సేవ

ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సంయుక్తంగా నిర్వహించిన "తిరుపతి వెంకట కవుల సాహిత్యసేవ" పై సదస్సు ఈ సభలో ఏర్పాటు చేయుట అభినందించదగిన విషయం. మాజీ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ముఖ్యఅతిథిగ విచ్చేసిన ఈ సదస్సుకు త్రివేణి పత్రికా సంపాదకులు శ్రీ భావరాజు నరసింహారావు అధ్యక్షత వహించారు డా॥ జంధ్యాల మహతీ శంకర్ తిరుపతి వెంకట కవుల అవధాన చాతురి గురించి, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం నాటక సాహిత్యం గురించి అనర్గళంగా

ఉపన్యసించి తిరుపతి వెంకట కవుల సాహితీ సేవను సభికుల ముందుంచి, వారిని అలరించారు. శ్రీ కోట సుందరరామశర్మ చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారి శిష్యరికం గురించిన జ్ఞాపకాలను తెలియజేశారు. సాంస్కృతిక వ్యవహాల శాఖ డిప్యూటి డైరెక్టర్ శ్రీ వి. రాధాకృష్ణమూర్తి వందన సమర్పణ చేశారు.

## రూపక, కథా, నవలా సదస్సు

సాయంత్రం గం. 5-00 లకు. శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య అధ్యక్షతన రూపక, కథా, నవలా సదస్సు జరిగింది. శ్రీ పోతుకూచి సాంబశివరావు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ప్రతీక నాటకరచన గురించి శ్రీ పురాణపండ రంగనాథ్, తెలుగు కథలో నూతన ప్రయోగాలపై శ్రీ విహారి, తెలుగు నవలలలో సామాజిక ప్రయోజనంపై శ్రీ కె. రామమోహనరాయ్, నాట్యావధాన ప్రక్రియపై శ్రీ స్వర్ణరాజ హనుమంతరావు ప్రసంగించారు.

ఇటీవల పరమపదించిన కవిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావు, శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ గొర్రెపాటి వెంకట సుబ్బయ్య, శ్రీ చెరబండ రాజుల స్మృతికి సంతాప సూచకంగా సభ రెండు నిమిషాలు మౌనం పాటించింది.

## కృష్ణాజిల్లా రచయితల సంఘం

కృష్ణాజిల్లా రచయితల సంఘం ఏర్పాటు చేయుట ఈ సభల వల్ల కలిగిన ఫలితంగా పేర్కొనవచ్చు. శ్రీ ముక్కామల నాగభూషణం అధ్యక్షతన, డా॥ తెన్నేటి హేమలత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావులు ఉపాధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా తాత్కాలిక కార్యవర్గం ఏర్పడింది. జిల్లా రచయితల సభలు జరుపుట, పుస్తక ప్రచురణ ఈ సంఘం ముఖ్యోద్దేశ్యం.

## కవిసమ్మేళనం

రెండు రోజులపాటు జరిగిన మహాసభలు సాయంత్రం గం॥ 7-00 లకు. కవి సమ్మేళనంతో ముగిశాయి.

కవిసమ్మేళనానికి అధ్యక్షత వహించిన ప్రసిద్ధకవి శ్రీ ఆరుద్ర సమసమాజ నిర్మాణం ఈనాటి రచయితలకు ఆదర్శంకావాలని అన్నారు. రచయిత ఊహాలోక సంచారంమాని జన జీవితంలోకి తొంగి చూడాలని, వారి కష్టసుఖాలు తన రచనలలో ప్రతిబింబింప చేయాలని అన్నారు.



కవిసమ్మేళనానికి అధ్యక్షత వహించిన శ్రీ ఆరుద్ర, ముఖ్య అతిథి శ్రీ యం. ఆర్. అప్పారావు, శ్రీ మండలి

జీవితాన్ని చూడకుండా ఊహాలోకంలో వుంటూ చేసే రచనలు కాలానికి నిలబడవని ఆరుద్ర అన్నారు. జానపదుల పాటలలో అచ్చమైన కవితాధార వుందని, ఇప్పుడు మినీ కవితలలో ఆ సూటిదనం కనిపిస్తోందని శ్రీ ఆరుద్ర పేర్కొన్నారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం మాజీ వైస్‌ఛాన్సలర్ శ్రీ యం. ఆర్. అప్పారావు వీడ్కోలు సందేశమిస్తూ "సంఘాన్ని ప్రతిబింబించే రచనల ద్వారా రచయితలు సమాజాన్ని ముందుకు నడిపించాలని" కోరారు.

మహాసభల ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు రచయితలకు కొన్ని విషయాలపై అభిప్రాయభేదాలు ఉన్నప్పటికి సంఘ శ్రేయస్సు అందరి ధ్యేయంగా వుండాలన్నారు. మహాసభలు విజయవంతంగా నిర్వహించుటకు తోడ్పడిన వారందరికి ధన్యవాదములు తెలిపారు.

అనంతరం జరిగిన కవిసమ్మేళనంలో 26 మంది కవులు తమ స్వీయ కవితలను వినిపించారు. తదనంతరం "నాట్యమయూరి" పతివాడ రాధిక కూచిపూడి నృత్యప్రదర్శనలతో సభలు విజయవంతంగా ముగిశాయి.

రెండు రోజులు జరిగిన మహాసభల కార్యక్రమాలన్నీ క్రమశిక్షణతో నిర్వహింపబడ్డాయి. సదస్సులు సాహితీ ప్రియులతో నిండిపోయాయి. సేవాశ్రమంలో ప్రతినిధులకు వసతి సౌకర్యాలు, శ్రీ మండలి స్వగృహమైన సేవాసదన్‌లో భోజన సదుపాయాలు అతిథులను సంతుష్టులను చేశాయి. మహాసభలు విజయవంతంగా జరగడానికి అహోరాత్రులు కృషిజరిపిన సారధ్య సంఘం అధ్యక్షులు శ్రీ గుత్తికొండ సుబ్బారావు, ప్రధాన కార్యదర్శి శ్రీ మండలి బుద్ధప్రసాద్ అభినందనీయులు. ఇంతటి బృహత్ కార్యక్రమాన్ని చేపట్టి సక్రమంగా నిర్వహించినందుకు దివిసీమ సాహితీ సమితి గర్వించక తప్పదు. * * *

"ఆ! ఇప్పుడు
నా రూపాయికి
[illegible]తేనా వచ్చేది ?"

**అవును. అంతే మరి. కాని మీరు స్టేట్ బ్యాంక్ క్యాష్ సర్టిఫికెట్లలో మదుపు పెట్టిన రూపాయి మాత్రం సుమారుగా మూడు రూపాయలు తెచ్చి పెడుతుంది—సమయానికి!**

క్యాష్ సర్టిఫికెట్లు
10 కాలపరిమితులలో—12, 24, 36, 48, 60, 72, 84, 96, 108 మరియు 120 నెలలవి దొరుకుతాయి.

కాలపరిమితి ఎంత ఎక్కువైతే జారీ ధర అంత తక్కువ మరి.

రూ. 100, రూ. 1000, రూ. 10,000, లేక రూ. 50,000 విలువచేసే స్టేట్ బ్యాంక్ క్యాష్ సర్టిఫికెట్లను ఇప్పుడు వాటి మూడవ వంతు ధరకే కొనండి. ఇప్పట్నుంచీ పదేళ్ళ తర్వాత మొత్తం నగదును చేతికందుకోండి!

మరింత ఉత్తేజకరమైన వివరాలకు మీకు దగ్గరలో గల మా బ్రాంచ్‌కి విచ్చేయండి.



## స్టేట్ బ్యాంక్

భారతదేశంలో అత్యంత పెద్దదైన బ్యాంక్

# బలహీన వర్గాలకు చేయూత

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమాన్ని అమలు జరపడంలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా ఉంది. ఈ కార్యక్రమంలో భాగంగా బలహీనవర్గాల సంక్షేమానికి ఇటీవలి సంవత్సరాలలో అమోఘమైన పథకాలెన్నింటినో అమలుజరుపుతున్నారు.

సంక్షేమ కార్యక్రమాలలోని కొన్ని ముఖ్యాంశాలు :

* మిగులు భూముల పంపిణీ :
  74,062 మంది షెడ్యూలు కులాలవారికి 1.05 లక్షల ఎకరాలు
  24,371 మంది షెడ్యూలు తరగతులవారికి 39.8 వేల ఎకరాలు
  40,871 మంది వెనుకబడిన తరగతులవారికి 68.7 వేల ఎకరాలు

* ప్రభుత్వ భూముల పంపిణీ :
  4,68,672 మంది బలహీనవర్గాల ప్రజలకు 8.11 లక్షల ఎకరాలు

* 12 లక్షలమంది పేదలకు ఇళ్ళ స్థలాల పంపిణీ, వారిలో చాలామంది బలహీనవర్గాల వారికి చెందినవారు ఉన్నారు.

* 12,701 మందిని వెట్టిచాకిరినుంచి విముక్తి కలిగించారు. ఇంతవరకు 5,800 మందికి పునరావాసం కల్పించారు.

* వ్యవసాయ కూలీల కనీసవేతనాల అమలు :
  వారిలో చాలామంది వెనుకబడిన తరగతులవారు ఉన్నారు.

* ప్రభుత్వ ఉద్యోగాలలో నియామకానికి వెనుకబడిన తరగతులవారికి ఇచ్చే రిజర్వేషన్లను మరో 10 సంవత్సరాలకు పొడిగించారు.

* వర్ణాంతర వివాహాలు చేసుకునేవారికి ప్రోత్సాహం కల్పిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ లో ఈనాడు బడుగువర్గాలవారు ఎంతో ఉత్సాహంతో ముందడుగు వేస్తూ ఉజ్వల భవిష్యత్తు వైపు పయనిస్తున్నారు.

సమాచార పౌరసంబంధశాఖ డైరెక్టరుచే ప్రకటితము.
దిన : 49/

Printed at Sri Bharathi Press, Machilipatnam
Printed at Sri

